# సంజ వెలుగు

★

"హిత శ్రీ"

ఎప్పటిలాగే సూర్యుడు తూర్పు దిక్కున ఉదయించాడు. శశిరేఖ నిద్రలేచింది. సోఫావైపు చూసింది. కిటికీలోంచి వస్తున్న వీచేగాలికి పేపరు టపటపకొట్టుకొంటోంది. శశిరేఖ మంచంమీదినించి లేచి సోఫాలో కూర్చుంది.

"రాజా."

"............"

"పేపరు వార్తలేమిటి, రాజా?"

"............"

ఒక క్షణం ఆగి శశిరేఖ గట్టిగా నవ్వింది.

"ఇది నిన్నటి పేపరు, భలే!"

ఆ పేపరు లాగేసి, ఆరోజు పేపరు దాని స్థానే ఉంచింది, శశిరేఖ.

"ఏదో ఒకటి, పేపరంటూ ఉంటేసరి, కాదూ?"

చిన్నగా నవ్విందామె. క్షణం నిశ్శబ్దం. ఆమె ముఖంలో కాంతిరేఖలు అదృశ్యమయాయి.

"రాజా!" దీనంగా పిలిచింది.

"............"

పనిమనిషి కాఫీ బల్లమీద పెట్టి వెళ్ళిపోయింది.

"కాఫీ, రాజా."

"............"

"కాఫీ అక్కర్లేదా?"

"............"

"అన్నట్టు, ఇవాళనించే కాబోలు కాఫీ మానెయ్యటం, అంతేనా?"

"............"

"పలకరా, రాజా?"

'రాజా' పలకడు, ఉలకడు, ఆమె కళ్ళల్లో గిర్రున తిరిగిన కన్నీటి బిందువులు రెండు పేపరుమీదికి జారాయి. కొంతసేపటి దాకా ఆమె అలాగే ఉండిపోయింది. "కాఫీ చల్లారిపోతోందమ్మా." కప్పులు తీసుకు వెళ్ళటానికివచ్చిన పనిమనిషి, కాఫీ సంగతి జ్ఞాపకంచేసింది. శశిరేఖ గబగబా కాఫీ తాగేసింది. పనిమనిషి కప్పులు తీసుకువెళ్ళిపోయింది.

"స్నానానికి టైమయింది, రాజా."

"............"

"లేవరా?"

'రాజా' కదలడు, మెదలడు.

పనిమనిషి బకెట్‌లో నీళ్ళు తెచ్చిపెట్టి వెళ్ళిపోయింది. శశిరేఖ నీళ్ళల్లో తువ్వాలుముంచి ముఖం కడిగింది. కొత్తషర్టు తొడిగింది.

కిటికీలోంచి లేత సూర్యకిరణాలు 'రాజా' మీద పడుతున్నాయి.

"ఇవాళ ఎంత బాగున్నారో అద్దంలో ఓసారి చూసుకోండి."

'రాజా' కళ్ళెత్తడు.

ఆమె 'రాజా' వైపు అలాగే చూసింది.

'రాజా' నోరు విప్పడు.

కాసేపు నిశ్శబ్దం.

"మరి నేను వెళ్తా, రాజా. డాక్టర్లకి ఎంత పనుంటుందో మీకు చెప్పేదేముంది?"

బరువుగా, దీర్ఘంగా ఓ నిట్టూర్పువిడిచి, 'రాజా' తల ఓసారి నిమిరి. చెమ్మగిలిన కళ్ళు తుడుచుకుని, గదిగడపదాటింది శశిరేఖ.

ఎప్పటిలాగే సూర్యుడు అస్తమించాడు. క్రమంగా చీకటి దట్టంగా వ్యాపించసాగింది. గడియారంలో గంటల ముల్లు తొమ్మిది మీదికి జరిగింది.

"ఇవాళ ఓ ఆపరేషన్ చాలా నేర్పుగా చేశాను, రాజా. మొదట కొంచెం భయపడ్డాను. కాని జయప్రదంగా చేశాను. మీరే అయితే అసలు..." శశిరేఖ ఆగింది.

'రాజా' వైపు ఆర్ద్రనేత్రాలతో చూసింది.

'రాజా' మెప్పుకోలుకి సంతోషించడు.

"అంతా మెచ్చుకున్నారు, రాజా,"

కాని 'రాజా' మెచ్చుకోడు.

"ఎంత గొప్ప డాక్టరైనా నా రాజాతరవాతే."

'రాజా' సంతోషించడు.

"ఎప్పుడూ పేపరు చదవేనా?" కొంటెగా పేపరు లాగి వెయ్యబోయింది.

'రాజా' అడ్డుపెట్టడు. "ఏమిటీ కొంటెచేష్టలు?" అనడు.

"ఎప్పుడూ చదువుతుంటే కళ్ళు పాడయిపోతాయి."

'రాజా' కళ్ళు మూసింది ఆమె. కాని 'రాజా' తన చల్లని చేతితో ఆమె చేతిని కళ్ళకద్దుకోడు. ముద్దుపెట్టుకోడు. దుఃఖం

ఆమె గుండె చీల్చుకొని బయటికి వొచ్చి నదీప్రవాహంలా ప్రవహించసాగింది. 'రాజా' భుజంమీద తల ఆన్చి కన్నీటితో అభిషేకం చేసింది. అలా ఎంతసేపున్నా ఆమెకి టైం తెలియదు. ఏ రాత్రివేళో లేచి మంచంమీద పడుకుంటుంది. మామూలే. 'రాజా' ఆమెని ఓదార్చడు. ఓదార్చలేడు. మళ్ళీ తెల్లవారుతుంది...

మళ్ళీ 'రాజా'ని పలకరిస్తుంది; లాలిస్తుంది; హాస్యాలాడుతుంది; నవ్వుతుంది; కబుర్లు చెబుతుంది; పొగుడుతుంది. 'రాజా' పెదవి మెదల్చడు; కళ్ళెత్తి చూడడు; చిరునవ్వు నవ్వడు. ఆమె ముఖంలో విషాదం అలుముకుంటుంది; కన్నీరు గిర్రున తిరుగుతుంది; విలపిస్తుంది. కాసేపు అదే అవస్థలో 'రాజా' భుజంమీద తల ఆనించి ఏదో లోకంలో విహరిస్తుంది; ఏదో ప్రశాంతత మనసుకొంత సేపటికి ఆవరిస్తుంది. అదే అవస్థలో తనని తాను మర్చిపోతుంది. ఏ రాత్రివేళో మెళకువ వస్తుంది. లేచి మంచంమీద పడుకుంటుంది. మళ్ళీ తెల్లవారుతుంది—

## 2

"డాక్టర్ గారు చాలా మంచివారు."

తన తండ్రి జబ్బు నయం చేసిన డాక్టర్ రాజగోపాలరావుని గురించి శశిరేఖ ఆమాటలంటే ఇంట్లో అంతా 'అవును' అని ఘంటాపథంగా ఒప్పుకున్నారు. కాని శశిరేఖకి మాత్రం తృప్తి కలగలేదు. మళ్ళీ ఆ మాటలే అంది. 'నిజమే' అన్నారంతా. 'పాపం, చాలా మంచివాడు' అంది శశిరేఖ మూడోసారి.

'అలాగా!' అన్నాడు ఆమె తండ్రి కొంచెం నవ్వి. అప్పట్లో ఆమెకి తెలియలేదు, ఆమాటల వెనకాల ఉన్న అర్థం. ఇంటర్మీడియట్ అయితే ప్యాసయింది కాని ఆలోచనాశక్తి అంతగా అలవడలేదు అప్పటికి.

"అంత మంచి డాక్టర్ని నేనెక్కడా చూడలేదు." అంది.

"నువ్వుకూడా డాక్టర్ చదివితే అంతకంటే మంచిదానివి ఔతావు."

"ఎవరైనా ఆయన తరవాతే."

ఆమె తండ్రి చిన్న నవ్వు నవ్వి ఊరుకున్నాడు.

"డాక్టర్ని మరీ అంత ఆకాశానికెత్తాలిసిన అవసరమేమీ నాకు కనపడటంలేదు." అన్నాడు శశిరేఖ తమ్ముడు.

"ఏం?"

"డాక్టరైనవాడు తన పని ఏదో చూసుకుపోవాలి గాని ఊరికే ఇంట్లో అందరి ముఖాలవైపూ తేరి పార చూడట మెందుకు?"

శశిరేఖ గుండె గతుక్కుమంది. వీడు ఉన్నట్టుండి ఏదో అంటాడు, విధవ! అయితే తనుకూడా అనుకుంది. నిజానికి చాలాసార్లు, డాక్టర్ అప్పుడప్పుడు తనవైపు అలా చూడటం అంత బావుండలేదని. తమ్ముడి రిమార్కుని ఎవరూ లక్ష్యంచెయ్యలేదల్లే ఉంది. ఎవరూ ఏమీ మాట్లాడలేదు కాసేపటివరకూ.

"డాక్టరుకి పెళ్ళయిందా?" అమ్మ అడిగింది. ఆవిడకి అనుమానాలు. ఇంతవరకు ఎవరికీ ఆ సందేహం కలగలేదు.

"ఏమో!"

ఆ సమాధానానికి శశిరేఖకి కొంచెం కోపం వొచ్చింది. చుట్టుపక్కల ఉండేవాళ్ళని గురించి ఆమాత్రం తెలుసుకోలేం?

"అయే ఉంటుంది." అన్నాడు తమ్ముడు. వాడివైపు ఆమె చురచుర చూసింది. అన్నీ తెలిసినట్టు మాట్లాడతాడు.

"ఆయన మంచితనానికి తగ్గ మంచి భార్య దొరికితే అదృష్టవంతుడే." అన్నాడు నాన్న తనవైపు చూస్తూ. అలా తనవైపు చూడటమెందుకు?

"మన శశిరేఖలాంటి పిల్లయితే సుఖపడతాడు." అమ్మ అంది. అమ్మకి తనమీద ఎంతో అభిమానం. ఆమెమీద తనకిగల ప్రేమ ఆ క్షణంలో ద్విగుణీకృతమైంది.

ఆవిడ అన్నట్టు డాక్టర్ రాజగోపాలరావు శశిరేఖని పెళ్ళి చేసుకొని చాలా సుఖపడ్డాడు. కావాలంటే ఆమెని మెడిసిన్ చదవమన్నాడు అతను. కాని అందువల్ల అతనికి కలిగే ఇబ్బందుల్ని తలుచుకుని శశిరేఖ ఆ మాట తలపెట్టటం మానుకుంది. రాజగోపాలరావు వ్యక్తిగతంగా చాలా నిర్లక్ష్యస్వభావం కలవాడు. అతనికి కావలసిన ప్రతీది శశిరేఖ స్వయంగా సమకూర్చిపెట్టాలి. అలాంటి పరిస్థితిలో అన్నాళ్ళు అతనిని విడిచిపెట్టి ఎలా ఉంటుంది?

జాలిగా అదే ప్రశ్న అడిగింది శశిరేఖ. రాజగోపాలరావు యుద్ధప్రదేశానికి డాక్టరుగా వెళ్ళటానికి నిశ్చయించుకున్నప్పుడు. అతను నవ్వి అన్నాడు.

"నువ్వు లేనన్నాళ్ళూ ఎలా ఉన్నాను?"

"ఆ సంగతి వేరు."

"మళ్ళీ కొన్నాళ్ళు అలాగే బతుకుతాను."

ఆమె బతిమాలింది. ప్రాధేయపూర్వకంగా అడిగింది. ఉద్దేశం మార్చుకోమని.

"మనుషులు చచ్చిపోతుంటే డాక్టరైనవాడు చూస్తూ ఎలా ఊరుకోగలడు?" అన్నాడతను.

"డాక్టర్ల అవసరం యుద్ధభూమిలోనే కాదుగా!" అందామె.

"ప్రతివాడు అలాగే అనుకుంటే ఇక వెళ్ళేవాళ్ళెవరు?"

ఆమె సమాధానం ఏమీ చెప్పలేకపోయింది.

"పోనీ, నాకోసం..." చివరి ప్రయత్నంగా అంది.

"శశీ, చదువుకున్నదానివి. నువ్వే అలా అంటే ఎలా?" ఇక ఏమనగలదు?

"నీకంటే నాకు ఎవరున్నారు? కాని విధ్యుక్తధర్మం నెరవేర్చవద్దా?"

అతని ఉద్దేశాలు, ఆదర్శాలు ఆమెకి తెలియనివి కావు.

"గాయపడి వైద్యసహాయంకోసం కొనప్రాణాలతో ఆశగా ఎదురుచూసేవాళ్ళని తలచుకో, ఒక్కసారి." శశిరేఖ కళ్ళలో నీళ్ళు

తిరిగాయి. ఆదృశ్యం ఎక్కువసేపు మనసులో నిలుపుకోలేక పోయింది. అంతా తన నేదో ఆర్పిస్తున్నారు. జాలిగా చేసు కుంటున్నారు. దీనావస్థలో ఉన్న ఆ నిర్భాగ్యులతో సంతను ఇవ్వ గలిగినది ఇవ్వకుండా ఎలా ఉండగలదు.

"రాజా!" ఇంకా తను చెప్పగలిగిందేమీ లేనట్టు, కంపిత స్వరంతో అంది. రాజగోపాలరావు ప్రేమపూర్వకంగా ఆమెని దగ్గ రికి తీసుకున్నాడు.

"శశి, మెడిసిన్ చదువుతావా?"

ఆదర్శప్రాయుడైన తన భర్త అనుభవాల్లో నశించటాని కంతకంటే సదవకాశం ఏం ఉంటుంది?

"ఊరికే కాలంగడపటంకంటె ఏదో పనికివచ్చే చదువు చద వటం మంచిదికదూ!" ఆమె తల ఊపింది.

శశిరేఖని స్వయంగా మెడికల్ కాలేజీలో చేర్పించి వెళ్ళి పోయాడు రాజగోపాలరావు.

తను మెడిసిన్ ప్యాసైతే భర్తకి ఎంతో అండగా ఉంటుంది. ఇద్దరూకలిసి ప్రాక్టీసుచెయ్యవచ్చు. ఎంతో ఆదర్శ ప్రాయంగా, 'డాక్టరంటే అలా ఉండాలి' అని నలుగురూ అను కునేలా వైద్యవృత్తి చెయ్యవచ్చు. పేదలకోసం ఉచితవైద్యశాల నడపవచ్చు. శశిరేఖ ఎన్నో కలలుకంది. కష్టపడి చదవసాగింది. సంవత్సరంపైన సంవత్సరం గడిచిపోయింది.

రాజగోపాలరావు రాలేదు. ఏరోజైనా రావొచ్చు ఏ క్షణా నైనా రావొచ్చు. ప్రతిరోజు పోస్టు శశిరేఖకి ఆశాభంగం కలి గిస్తూనే ఉంది.

'రాజగోపాలరావు ఇహరాడు. ఇహరాడు!' శశిరేఖ ఈవార్త నమ్మలేదు. నమ్మలేకపోయింది. కాని—అంతా నమ్మారు. పోస్టులో అతని దుస్తులువొస్తే మరి నమ్మక ఏం చెయ్యగలరు, ఎవరు మాత్రం? "ఇహరారా, రాజా?" దీనంగా, బాధగా అడుగుతుంది, రోజూ. సమాధానం ఎవరు చెబుతారు?

శశిరేఖ మెడిసిన్ ప్యాసైంది. ప్రాక్టీసుచేస్తోంది. 'లేడీ డాక్టర్ శశిరేఖ చాలామంచిది' అని ఎవరైనా అంటే ఆమెకి వెంటనే తన భర్త జ్ఞాపకం వొస్తాడు.

"ఎవరైనా ఆయన తరవాతే."

ఆమె కళ్ళలో నీళ్ళు గిర్రున తిరుగుతాయి. తన భర్తనించి తను నేర్చుకోవాలిసిందంతా అలా వృథాగా పోవాలిసిందేనా?

## 3

ఉదయం ఏడు గంటలయింది.

"రాజా, కాఫీ."

"............"

"కాఫీ, రాజా."

రెండు కన్నీటి బిందువులు ఆమె కళ్ళనించి జారిపోయి 'రాజా' చేతుల్లోని పేపరు తడిపాయి.

కొన్ని క్షణాలు అలాగే గడిచిపోయాయి. ఆమె ఏవేవో సంగతులు జ్ఞాపకం చేసుకుంటోంది. సుబ్బ్రహ్మణ్య సూర్యబింబంలా కాంతిహీనమైన ముఖం 'రాజా' బుజంమీద ఆనించి అలాగే ఉండి పోయింది.

"శశిరేఖా."

అస్పష్టంగా వినిపించాయి మాటలు.

'రాజా' పెదవులవైపు మాసింది, భ్రమతో. మళ్ళీ తలవాల్చు కుంది.

"శశి."

ఏవేవో భావాలన్నీ అణచుకుంటూ గాద్గదికంగా వినిపించింది ఆ పిలుపు. శశిరేఖ తలెత్తిద్వారంవైపు చూసింది. సుదీర్ఘ విగ్రహం. తొరటాసిఉంది. నల్లటి కళ్ళద్దాలున్నాయి. హస్తకడిచేయి వేళ్లాడుతోంది. ఎడమనెంపమీద చెవిదాకా పెద్ద గాయంతగిలి మానిన మచ్చఉంది. ఎవరు?

అతను నల్లకళ్ళద్దాలుతీ సేశాడు.

"శశీ... నేనే, నీ..."

"రాజా!"

గుండె ఆగిపోయినట్టు ఒక క్షణం అనుభూతి పొందిందామె.

అతను ఆమెని సమీపించాడు. ఆమె నుంచోలేకపోయింది. మెల్లిగా సోఫాలో కూలబెట్టాడు. ఆమె స్పృహతప్పగించి చూస్తోంది.

"మీరేనా!"

"నేనే శశీ.?"

అతనివైపు అలాగే చూడసాగిందామె. తరవాత ఆమెకేమీ కనిపించలేదు. కన్నీటి తెరలు చూపుని అడ్డకట్టాయి. కళ్ళుమూసు కొంది. ఆమె తలని హృదయానికి కదుముకున్నాడతను.

పనిమనిషి బకెట్‌తో నీళ్ళు తెచ్చి అక్కడ పెట్టబోయి హఠాత్తుగా కొత్తవ్యక్తిని ఆ పరిస్థితిలో చూసి కంగారుపడి, బకెట్ తటాలున వొదిలేసి వెనక్కి వెళ్ళిపోయింది. చప్పుడుకి ఇద్దరూ మళ్ళీ ఈ లోకంలోకి వొచ్చారు. ఆమె ఏదో అనుగాలనుకుంది. ఏమడగాలో, ఏది ముందడగాలో ఆమెకి తెలీలేదు.

"జీవితంలో మళ్ళీ ఎప్పటికైనా నిన్ను చూడగలుగుతానా అనుకున్నాను. శశీ."

శశిరేఖ మాట్లాడే స్థితిలో లేదు.

"గుండుదెబ్బతగిలి పడిపోయినప్పుడు కళ్ళని కమ్మిన చీకట్లో మెరుపులా ఒకసారి నువ్వు మెరిశావు. అదే ఆఖరిసారనుకున్నాను. కనీసం నా శశి ప్రతిబింబమైనా చూశాను. ఇహఏమైనా పరవా లేదనుకున్నాను. అదృష్టం బావుండి ఆ దెబ్బకి చచ్చిపోలేదు. ఆ రాత్రి తెల్లవారింది. చుట్టుపక్కల ఎవరూ లేరు. అప్పటికప్పుడే ఆ ప్రదేశంనించి మనవాళ్ళు వెళ్ళిపోయారు. అకస్మాత్తుగా జరి గిన మట్టడికి వాళ్ళు తట్టుకోలేకపోయారు కాబోలు. తరవాత ఎన్ని అవస్థలు పడ్డానో దైవానికే తెలుసు. ఖైదీల క్యాంపులో

దుర్భరజీవితం గడిపాను. ఎలాగో తప్పించుకున్నాను. యుద్ధం ఐపోయింది. నా సంగతి పట్టించుకున్నవాళ్ళు ఎవరూ లేరు. బహుశా చచ్చిపోయాననుకుని ఉంటారు. ఎన్నో అగచాట్లుపడి చివరికి మనదేశం చేరుకున్నాను."

డాక్టర్ రాజగోపాలరావు ఆగాడు. అతని కష్టాలకి ఆమె గుండె తరుక్కుపోతోంది. కాసేపు అదే అవస్థలో ఉండి తరవాత అడిగింది.

"వొచ్చేటప్పుడు ఉత్తరమైనా రాయలేకేం?"

రాజగోపాలరావు కొంచెం తట పటాయించి అన్నాడు.

"ఇక్కడి పరిస్థితులు ఎలా ఉన్నాయో నాకు తెలియదు' కదా. స్వయంగావచ్చి పరిశీలించి, వీలునుబట్టి నన్ను తెలియ బరచుకుందా మనుకున్నాను. అందరూ నేను చచ్చిపోయి ఉంటానని నమ్మిఉంటారు."

శశిరేఖ అతన్ని మరింత దగ్గరగా హృదయానికి అదుముకుంది.

"అదేగాక..." అతను ఆగాడు.

ఏమిటన్నట్టు ఆమె అతనివైపు చూసింది.

"నువ్వు ఏ పరిస్థితిలో ఉన్నావో ముందు స్వయంగా చూడటం మంచిదనుకున్నాను, నిజంచెప్పాలంటే," ఆమె మళ్ళీ కన్నీళ్ళు నింపటంకంటె మరేమీ సమాధానం ఇవ్వలేదు.

"కాని, శశీ. మొదట అది విగ్రహం అనుకోలేదు. దవ్వున వినక్కుతగ్గాను. ఇంతలో 'కాఫీ రాజా' అని ఆర్ద్రంగా విషాద స్వరం వినిపించింది. శశీ, ఆ పిలుపులో ఏదో అనిర్వచనీయమైన అనుభూతి, మానవహృదయపు లోతుల్ని పరిశోధించి ఏదో నిత్యమైన సత్యాన్ని విన్నట్టుగా, అస్పష్టంగా నా హృదయం అంతటా నిండింది. ఏదో పాఠం నేర్చాను. ఇహ ఆగలేకపోయాను. లేక పోతే అంత అకస్మాత్తుగా కనిపించి ఉండను, శశీ."

భావోద్వేగంలో అతను ఇహ మాట్లాడలేకపోయాడు. శశి రేఖకూడా ఏమీ ప్రశ్నలు వెయ్యలేదు. అదే స్థితిలో మౌనంగా ఒకరి పక్కన ఒకరు ఆలోచించలేని మనస్సులతో నిశ్శబ్దంగా ఉండిపోయారు.

## 4

తెల్లవారింది ఆ రాత్రి. శశిరేఖ నిద్రలేచింది. ప్రక్కన చూసింది, ఎవరూ లేరు. సోఫావైపు చూసింది. కిటికీలోంచి వచ్చేగాలికి 'రాజా' చేతిలో పేపరు టపటప కొట్టుకుంటోంది. అంతా కలేనా! శశిరేఖ బరువుగా లేచి సోఫా వైపు నడిచింది.

"పేపరు వార్తలేమిటి, రాజా?"

రాజా పలకదు.

"ఇది నిన్నటి పేపరు, భలే."

ఆరోజు పేపరుకోసం వెళ్ళబోతుండగా రాజగోపాలరావు ప్రత్యక్షమయాడు గుమ్మందగ్గర.

కలకాదు! ఆమె ముఖంలో సంతోషరేఖలు అలుము కున్నాయి.

"పేపరు వార్తలేమిటి, రాజా?"

"రాజగోపాలరావు అనే మిలిటరీ డాక్టరు చిన్నచిన్న 'దెబ్బలతో' స్వదేశానికి తిరిగివచ్చాట." నవ్వుతూ అన్నాడతను. ఆమెకూడా హృదయపూర్వకంగా నవ్వింది. ఆ నవ్వులో గతం లోని బాధా, వర్తమానంలోని సంతోషం మేళవించగా, కొన్ని క్షణాలు ఆమె తన ఉనికినే మర్చిపోయింది.

గాలికి పేపరు టపటపకొట్టుకుంది. ఆ ధ్వనికి శశిరేఖకి చైతన్యంకలిగింది. తటాలున ఆమెకి పేపరుసంగతి జ్ఞాపకం వొచ్చింది 'రాజా' వైపు చూసింది ఓసారి. వెంటనే రాజగోపాల రావు వైపుకి దృష్టి మళ్ళించి, ఓక్షణం ఆగి గబాలున అతని చేతిలో పేపరులాగేసి 'రాజా' చేతుల్లో పెట్టింది. అతనామెవైపు ఆశ్చర్యంగా చూశాడు. ప్రత్యుత్తరంగా ఆమె ఓ చిరునవ్వు మాత్రం నవ్వింది.

వంటమనిషి కాఫీబల్లమీద పెట్టి వెళ్ళిపోయింది. రాజగోపాల రావు పేపరు చూస్తున్నాడు.

"కాఫీ, రాజా."

సప్రేమగా కాఫీకప్పు అందుకున్నాడతను, పెదవులమీద మందహాసంతో.

శశిరేఖ 'రాజా' వైపు చూసింది. మళ్ళీ రాజగోపాలరావు వైపుచూసింది. ఏదో తృప్తి ఆమె అనుభవించింది. కాని మళ్ళీ ఏదో భావం మనసులో మెదిలింది.

'రాజా'—తను రోజూ ఆరాధిస్తున్న 'రాజా'కి 'కాఫీ' అందివ్వలేదు. తన హృదయంలో ఉన్న రాజా ఎదురుగా ఉండగా ఇంకా ఈ విధంగా తను ఎందుకు నొచ్చుకోవాలి! ఆమె నవ్వింది! చిన్నగా. కాని సంపూర్ణంగా నవ్వలేకపోయింది. చెప్పలేని వెలితి ఏదో మిగిలిపోయింది.

"శశీ."

"............"

"ఏమిటాలోచిస్తున్నావు?"

"............"

"కాఫీ చల్లారిపోతోంది."

శశిరేఖకి అతనన్న మాటలేవీ వినపడలేదు. అతనామె భుజాన్ని తట్టాడు. ఉలిక్కిపడ్డది.

"ఏమిటలా చూస్తున్నావు?"

ఆమె పెదవులమీదికి నవ్వు తెచ్చుకొని అంది. "ఏంలేదు." "కాఫీతాను."

అప్రయత్నంగా ఆమె కాఫీ గబగబతాగేసి కప్పు కింద పెట్టింది.

"నీకు అక్కర్లేదుగా, అమ్మగారూ?" కప్పులు తీసుకు పోతూ పనిమనిషి అడిగింది.

"ఎందు కక్కర్లేదు?"

మళ్ళీ శశిరేఖ హృదయంలో ఏదో బాధ మెదిలింది. పని మనిషి మాట్లాడకుండా బకెట్‌లో నీళ్ళు తెచ్చి అక్కడపెట్టి వెళ్ళిపోయింది. శశిరేఖ తువ్వాలు నీళ్ళలో ముంచి 'రాజా' ముఖం, చేతులూ తుడిచింది. కొత్త పరుపువేసింది. రాజగోపాలరావు ఇదంతా ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

"ఏమిటి శశీ, ఇదంతా?"

ఆమె రెప్పవేయకుండా 'రాజా' వైపు చూస్తోంది. ఏమీ అనలేదు.

రాజగోపాలరావుకూడా ఆమె చూస్తున్న వైపు చూశాడు, తదేకంగా. ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో చెయ్యబడ్డ ఆవిగ్రహం మూడు మూర్తులా తనలాగే ఉంది. అకస్మాత్తుగా చూస్తే సజీవుడైన మనిషేనని భ్రమకలిగిస్తుంది. మొదట రాజగోపాలరావుకూడా అలాగే అనుకున్నాడు—పేపరు చూస్తూ, సోఫాలో కూర్చున్నట్టుగా ఉన్న ఆ విగ్రహంచూసి.

ఉన్నట్టుండి రాజగోపాలరావు గట్టిగా నవ్వాడు. కలలోంచి తేరుకున్నట్టుగా శశిరేఖ ముఖ భంగిమ పెట్టి అతనివైపు చూసింది, ప్రశ్నార్థకంగా.

"నీ బొమ్మకూడా ఒకటి చేయించి దానివైపు నన్నుకూడా చూస్తూ కూర్చోమంటావా ఏమిటి?"

శశిరేఖ నవ్వలేదు. అతనివైపు తృప్తిగా తేరిపారచూసి అతని భుజంమీద తల ఆనించి 'రాజా' అని ఆనందాతిరేకంతో కౌగలించుకుంది.

ఎన్నాళ్ళో తపస్సుచేసింది. తన రాజా తనకి తిరిగి లభించాడు. జీవితంలో అంతకంటె కావలసిందేముంది? అంతకంటె తను కోరే సౌఖ్యం, ఆనందం, కోరిక ఏముంటాయి?అలా ఎప్పుడూ తను అతని భుజంమీద తల ఆనించి ఏ భావనాప్రపంచంలోనో విహరించకలిగితే చాలు; జీవిత పరమావధి అందుకున్నట్టే. తన రాజా తనని ఇహ విడిచిపోడు. ఇహ తనకి కష్టాలు లేవు. విషాదం తన నించిదూరమైపోయింది. అనంతమైన ఆనందం, అనిర్వచనీయమైన ఆనందానుభూతి ఇహనించి తనదే. శశిరేఖ మురిసిపోయింది. సంతోషంతో హృదయం నిండిపోయింది. కాని...కాని, ఏమూలో—ఎక్కడో—ఏదో వెలితి. ఏదో తన నించి అస్పష్టంగా, కాని నిజంగా దూరమై, సుదూరమై పోతూన్నట్టు- మనసులో మారుమూల ఛాయామాత్రంగా అనిపించింది.

## 5

"ఇవాళ ఓ ఆపరేషన్ చాలా తేల్చుగా చేశాను, రాజా."

రాజగోపాలరావు గర్వంగా వింటున్నాడు.

"మొదట భయపడ్డాను. కాని చాలా జయప్రదంగా చేశాను."

"నా శశి గొప్ప డాక్టరైపోతోం దన్నమాట."

"ఎంతగొప్ప డాక్టరైనా నారాజా తరవాతే."

"శశీ." అనురాగంతో నిండిన హృదయంతో ఆమె కళ్ళలోకి చూశాడు, రాజగోపాలరావు.

అకస్మాత్తుగా శశి 'రాజా' వైపు చూసింది, ఆమె ముఖంలోని సంతోష చిహ్నాలు నెమ్మదిగా అంతరించాయి. అలాగే ఆ విగ్రహంవైపు చూస్తూనుంచుంది. తను 'రాజా' తో ఇప్పుడు అసలు మాట్లాడటంలేదు. ఆమె హృదయంలో ఏదో బాధ ఆమెని కలచివేసింది. తన 'రాజా'ని తను నిర్లక్ష్యం చేస్తోంది. ఒక్క మాటకూడా మాట్లాడటంలేదు. బాధగా అంది. "రాజా!" ఈ పరిస్థితి అర్థంకాక రాజగోపాలరావు తికమకపడ్డాడు.

"శశీ!" ఆమె పలకలేదు. మళ్ళీ పిల్చాడు. భుజం తట్టాడు.

"అలా ఐపోయావేం?"

శశిరేఖ అతనివైపు చూసింది. క్రమంగా ఆమె ముఖం వికసించింది. తన 'రాజా' అక్కడే, తన ఎదురుగానే ఉన్నాడు. ఏమిటి తన కాపిచ్చి భ్రమ—దౌర్బల్యం! తను తన రాజాని ఏమాత్రం నిర్లక్ష్యంగా చూడటంలేదు. ఎంతో ప్రాణంగా చూసుకుంటోంది. ఆమె నవ్వుతూ అతని ముఖంలోకి చూసింది. తొలగిపోయిన ఆనందం మళ్ళీ ఆమెని ఆశ్రయించింది. కాని-ఆ ఆనందం వెనకాల, దూరంగా, లీలగా, పోగొట్టుకున్న వస్తువేదో పోతే కలిగే అనుభూతి లాంటిది-తన ఉనికిని తెలియచేస్తోంది. రానురాను శశిరేఖకి ఇదో సమస్యగా పరిణమించింది. ఉన్నట్టుండి 'రాజా' విగ్రహం జ్ఞాపకంవోస్తుంది. మళ్ళీ తన రాజాని తలుచుకొని తృప్తిపడుతుంది. ఏదో వెలితి మాత్రం లీలగా గోచరిస్తూనే ఉంటుంది.

ఈ పరిస్థితి చాలాసార్లు గమనించాడు రాజగోపాలరావు. ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో చెయ్యబడిన ఆ విగ్రహం చూస్తున్న కొద్దీ మానసికంగా అతనికేదో బాధకలిగేది. నిండైన ఆ విగ్రహం పూర్తిగా తన పోలికే. తను పూర్వం—యుద్ధంలోకి వెళ్ళకముందు అలాగే ఉండేవాడు. కాని ఇప్పుడు...రాజగోపాలరావు ఇహ ముందు ఆలోచించలేకపోయేవాడు. ఆ ఆలోచనే అతనికి భయం కలిగిస్తుంది. తను కుడిచెయ్యిలేని డాక్టర్. ముఖంమీద వికృతంగా పెద్దమచ్చ. బండబారిన ముఖం...కాని తను, ఎలా ఉంటేనేం? తన శశికి తనమీద ఎంతో మక్కువ, అయినా శశి ఆ విగ్రహంవైపు అలా చూస్తుంటే, దాన్ని అంతశ్రద్ధగా రోజూ శుభ్రంగా ఉంచటానికి పాటుపడుతుంటే అతనిలో ఏదో అయిష్టత గూడుకట్టుకుని ఎక్కువ కాసాగింది. తను పక్కన ఉండగా ఇంకా ఆ విగ్రహం గురించి అంత బాధెందుకని ఎన్నోసార్లు అడిగాడు - పరోక్షంగా, దాన్ని మరోచోటికి మరలించమని సూచించాడు. కాని శశి ఒప్పుకోలేదు. ఎక్కువగా ఆ విషయం గురించి మాట్లాడటం హాస్యాస్పదంగా ఉంటుందని ఊరుకున్నాడు.

శశి ఆరోగ్యం విషయం అతనికి కొంచెం ఆందోళన కలిగించింది. ఆమె ఏదో మనసులో బాధపడుతున్నట్టుగా అతనికి కొన్నాళ్ళనించీ అనుమానంకలిగింది. ఆ ఉదయం కాఫీ తాగుతుంటే అడిగాడు కారణం. ఆమె నవ్వి ఏమీ లేదంది.

"అలా రోజురోజుకీ తగ్గిపోతూ ఏమీ లేదంటావేం?"

ఉన్నంతకాలం నీకు మనశ్శాంతి ఉండదు, నువ్వుకూడా నా కళ్ళముందే, నేను చూస్తూ ఉండగానే జీవచ్ఛవంలా అయిపోయి, నిరంతర వేదనతో ఎందుకూ కొరగాకుండాపోవటం ఎలా సహించగలను?

కనీ, మరోలోకం ఏదైనా ఉంటే మనం తప్పకుండా కలుసుకుంటాం - అక్కడ. అందాకా ఎక్కడో—

నీ రాజా,

ఉత్తరం ఎలా పూర్తిచేసిందో తెలియదు; శశిరేఖ 'రాజా' మీద రెండుచేతులూ వేసి తల బుజంమీద ఆనించి భోరున ఏడ్చింది. కన్నీరు ఎడతెగకుండా ప్రవహిస్తూ 'రాజా' ని తడిపేస్తోంది.

రాజా ఇహ రాడు.

ఆమె కుమిలికుమిలి ఏడ్చింది.

"ఇదేనా రాజా, మీకు అర్థంచేసుకుంది?"

ఎన్నో వందలసార్లు అడిగింది.

'రాజా' పలకడు. కళ్ళెత్తిచూడడు.

దుఃఖం ఆమెగుండె చీల్చుకుని నదీప్రవాహంగా ప్రవహించసాగింది. ఆ ప్రవాహంలో వ్యథలూ, బాధలూ అన్నీ కొట్టుకుపోయాయి. అపారమైన, అనిర్వచనీయమైన శోకం ఏదో గీతిక ఆలాపించగా, శశిరేఖ కన్నీటికెరటాలమీద తేలిపోతోంది - ఎక్కడికో, ఏ సీమలోకో. ఆ తరంగమృదంగనాదం వింటూ తన్మయావస్థలోకి ప్రయాణిస్తున్న శశిరేఖ మనసులో కనిపించింది, మూగ మూల, ఛాయామాత్రంగా - క్రమంగా స్పష్టంగా - కదనించి దూరమైనదేదో తన దగ్గిరికి వొస్తోంది క్రమంగా, నిజంగా.



# కో-ఆప్టెక్స్

చేనేతవస్త్రములు
తయారుచేయువారు
సమర్పించు

## ఉగాది
## శుభాకాంక్షలు






ప్రతిసంవత్సరం కో-ఆప్టెక్స్ వస్త్రములు కొనండి ఇవి మీ అభిరుచులకు మీ శక్తికి అనుకూలముగ తయారుచేయబడినవి. ఇవి

★ అందమైనవి
★ పొదుపైనవి
★ మన్నిక గలవి

రాష్ట్రమంతటా 124 డిపోలలో లభిస్తున్నవి.

## మద్రాస్ స్టేట్ హేండ్‌లూం వీవర్స్ కో-ఆపరేటివ్ సొసైటీ లిమిటెడ్

48/1, రాయపేట హైరోడ్డు, మద్రాసు-4

తంతి : *Handloom.* ఫోన్ : 8176 & 85839

---

# బ్యాంక్ ఆఫ్ బరోడా లిమిటెడ్

(స్థాపితము - 1908)

| | | |
|---|---|---|
| అనుమతి పొందిన మూలధనము | రు. | **2,40,00,000** |
| జారీచేసి, చందావేసిన మూలధనము | .. | **2,00,00,000** |
| చెల్లించబడిన మూలధనము | .. | **1,00,00,000** |
| రిజర్వు నిధులు | .. | **1,28,00,000** |

బ్రాంచీలు, ఏజెన్సీలు,
ఇండియాలోని ముఖ్య కేంద్రాలన్నిటిలో గలవు.
దక్షిణ ఇండియాలో బ్రాంచీలు :

## మద్రాస్, కోయంబత్తూరు, హైదరాబాద్

చైర్మన్ :

## సేత్ తులసీదాస్ కిలాచంద్

(కిలాచంద్ దేవ్‌చంద్ & కంపెనీ లిమిటెడ్, బొంబాయి.)

అన్ని రకములైన, దేశీయ, విదేశీయ బ్యాంకింగు వ్యాపారం జరుపబడును. దిగుమతి, ఎగుమతి వ్యాపారమునకు వసతులు ఒసగబడును.

సేవింగ్సుబ్యాంక్ అకౌంట్లు, కరెంట్ అకౌంట్లు తెరువబడును

1 నెల నుండి 12 నెలల వరకు డిపాజిట్లు అంగీకరింపబడును.

వడ్డీ రేట్లు వ్రాసి తెలుసుకొనవచ్చును.

| | |
|---|---|
| కల్లూరి గోపాలరావు<br>మేనేజరు, మద్రాసు. | ఎమ్. ఎస్. డి' సౌజ<br>జనరల్ మేనేజరు. |

# బాధ్యత



శ్రీవంతుల శ్రీరామశాస్త్రి

పిఠాపురం,
తేదీ 1-2-1951.

మిత్రుడు భాస్కరరావుకి,

మనం పరస్పరం ఉత్తరాలు రాసుకొని ఒక పుష్కరంపైగా కాలం గడిచింది. మనం చదువుకొనే రోజుల్లో ఎవరైనా జ్యోతిష్కుడు మనం ఇంత దగ్గరలో ఉండి ఒకరినొకరము చూసుకోకుండా, ఉత్తరప్రత్యుత్తరాలు లేకుండా ఉంటామంటే నమ్మలేక పోయేవాళ్ళం. కాని, మనం ఎంత ఊహించీ, నమ్మలేని సంగతులే అతిసామాన్యంగా జరిగిపోతూ ఉంటాయి లోకంలో!

అసలు ఈ ఉత్తరం రాయడానికి బదులు నేనే బయలుదేరి రావాలనుకొన్నాను. కాని, ఇక్కడి ఇంటి పరిస్థితులు అనుకూలంగా లేవు. కాకపోయినా నేను అక్కడికి రావడంకంటే నువ్వు ఇక్కడికి రావడం చాలా బాగుంటుంది. మీ బాంకుకి ఆదివారం శెలవు ఉంటుంది కదా. మరొక రెండు మూడు రోజులు శెలవుపెట్టివస్తే చాలును. నేను రాకుండా నిన్ను రమ్మనడము మర్యాద లక్షణం కాదని నాకు తెలుసును. అయినా మన స్నేహాన్ని పురస్కరించుకొని, ఇలా రాసినందుకు అన్యథాభావించవని నమ్ముతున్నాను.

ఒక ముఖ్యమయిన అంశంలో నీ సలహా, నీ పలుకుబడీ, అత్యవసరంగా కావాలి. ఇందులో నీకు పెద్ద కష్టం ఏమీ ఉండబోదు. తప్పక రావలసిందని పదేపదే వ్రాయడం అనవసరం, అన్ని సంగతులూ ముఖస్థంగా మాట్లాడుకొందాము.

ఈ వచ్చే ఆదివారంనాడే వీలుంటే బయలుదేర గోర్తాను. బయలుదేరేముందు ఉత్తరంరాస్తే ఇక్కడ స్టేషనుకు నేను బండీ పంపిస్తాను. వీలుంటే నేనే వస్తాను.

వచ్చేటప్పుడు కారామసాలా కొంచెం, మంచిరకం తీసుకొని రావలెను. ఈ ఆదివారంనాడే తప్పక బయలుదేరవలెను.

ఇంతే సంగతులు
కా॥ కృష్ణశర్మ.

ఫిబ్రవరి మూడవ తేదీ 1951.

నిన్నరాత్రి వస్తుందేమో ననిపించిన జ్వరం మరిరాలేదు. ఉదయం లేచేసరికి మామూలుగానే ఉంది. భోజనంకూడా సరిగానే చెయ్యగలిగాను.

ఆఫీసులో ఏమీ విశేషాలు లేవు.

నరసింహం గతనెలలో పుచ్చుకొన్న పదిహేనులోనూ అయిదు బాకీపెట్టి పది ఇచ్చేడు. అదయినా నయమే, అడక్కుండా ఇచ్చేడు.

కామేశ్వరరావు వెనకటి ముప్ఫైరెండు తీర్చక పోడం అటుంచిగా, మరొక ఇరవైయిమ్మని అడిగేడు. అంతాకలిపి మళ్ళీ నెలలో తీర్చేస్తానంటాడు. ఈ నెలలో లేని అవకాశం మళ్ళీ నెలలో ఎలావస్తుందో ఊహించుకోకూడదా? అయినా గట్టిగా చెప్పలేకపోయేను. నాదగ్గరకూడా ఏమీలేదనీ, ఏవో అనుకోని ఖర్చులు వచ్చేయని చెప్పాను. ఈమారుగాని అడిగితే, ముందు లోగడ తీసుకొన్నది ఇమ్మని నిష్కర్షగా చెప్పాలి.

ఇవాళ ఉదయం ఒక చిత్రమయిన ఉత్తరంవచ్చింది కా. కృష్ణశర్మ ఇన్ని సంవత్సరాల తరవాత రాశాడు. అందులోనూ ఏదో ముఖ్యమయిన విషయంలో నా సలహా పలుకుబడీ కావాలట! అంత, నా అవసరం ఉన్నవాడు ఆ విషయం ఏమిటో స్పష్టంగా రాయకూడదా? అంత ఉత్తరంలో రాయకూడనిది ఏమయిఉంటుంది? ఇదేదో అనవసరపు గొడవలాగుంది. తనకు రావడానికి కుదరదట; అంటే ఇవతలివాళ్ళకు మరేమీ పనీపాటూ లేదని కాబోలు. అసలు సంగతేమిటో స్పష్టంగారాస్తే, అప్పుడు రావడం రాకపోడం మాట ఆలోచించవచ్చునని ఉత్తరంరాసి పడెయ్యాలి. 'ఉత్తరమే రాయకపోతే, మళ్ళీ వాడే రాస్తాడేమో. ఇన్నాళ్ళకు వాడు రాయకరాయకరాస్తే జవాబురాయకపోతే బాగుంటుందా? ఉత్తరం మాత్రం రేపు రాసిపడెయ్యాలి.

ఫిబ్రవరి నాలుగవ తేదీ 1951.

ఆదివారం. కొంచెంపని ఉందిగాని, బాంకుకి వెళ్ళలేదు. ఉదయం సుబ్రహ్మణ్యంవచ్చేడు. ఏవేవో చాలా కబుర్లుచెప్పేడు. వాళ్ళమ్మాయికాపురం నిలబెట్టేట్టు కనబడలేదట. పెళ్ళయేవరకూ ఈ సంబంధం ఎలాగయినా అయితే చాలుననుకోడం, వాళ్ళు చెప్పినషరతులన్నిటికి ఒప్పుకోడం తరవాత అన్నమాట నిలబెట్టుకో లేక, వాళ్ళు పట్టుపడితే, దుర్మార్గులు, హృదయంలేనివాళ్ళు అంటూ ఇక్కడా అక్కడా చెప్పుకోడం. ఏం లాభం. మొదటే నాలుగు సంగతులూ నిష్కర్షగా అనుకొని, శక్తిఉంటేనే ఒప్పుకో కూడదా? ఏదో తరవాత, అదే సర్దుకుపోకపోతుందా అనిముందు.

కళ్ళుమూసుకొన్నందువల్లనే ఇటువంటి అనర్థాలువస్తాయి. ఇప్పుడయినా తనమంచితనం, ఇబ్బందులు పడుతూండడం మొదలయిన వాటిమీదఉన్న దృష్టి కూతురు సుఖంమీద ఉన్నట్లులేదు.

క్షవరం చేయించుకోడం మూలాన మధ్యాహ్నం భోజనం ఆలస్యమయింది. భోజనం అయేసరికి పన్నెండయింది. తరువాత పత్రిక చదవడం, నిద్ర. మధ్యాహ్నం కాఫీ తరవాత *J. B. Priestly* రాసిన *Three time plays* లో మొదటిది *The Dangerous corner* పూర్తిచేశాను. నాటకం బాగానే ఉంది. కాని ఒకటే వింతగా తోచింది. నాటకంలోని అందరు మనుష్యుల మధ్యనూ ఏవేవో అసందర్భమయిన సంబంధాలే. కొన్ని వ్యక్తమయినవీ, కొన్ని అవ్యక్తమయినవీ. బహుశః *let sleeping dogs lie* అన్న అభిప్రాయాన్ని బాగా నాటేలాగ చేసేందుకు ఇన్ని మెలికలుపెట్టి ఉంటాడు. ఏమయినా నాటకం, రచయిత పీఠికలో చెప్పినట్టు, కాలానికి సంబంధించిన వైచిత్ర్యం దృష్ట్యానేకాకుండా చాలా బాగుంది! తక్కిన రెండు నాటకాల్లో ఏది ఆరంభించడమా అని ఆలోచిస్తూ ఉండగా విశ్వనాథమూ నారాయణమూర్తీ నరసింహం వచ్చారు. ఒక అరగంట బాతాఖానీ, తర్వాత షికారు. పార్కులో తెలుగువార్తలయేవరకూ కూర్చున్నాం. ఇంటికివచ్చే దారిలో రెండు తువ్వాళ్ళుకొన్నాను. ఒక్కొక్కటి రూపాయముప్పావలా. ఖరీదు ఎక్కువయినా బాగానే ఉన్నాయి. పంచలుకూడా కొనుక్కోవాలి. కాని, ఈ ఊళ్లో కుదరదు. బుచ్చిబాబుకి పంపిన మనియార్డరు రసీదు రేపురావాలి. కృష్ణశర్మ ఉత్తరానికి జవాబు రాయలేదు. రేపు తప్పకుండా రాసిపడెయ్యాలి.

*Priestly* నాటకాల్లో మధ్యది వెనక్కుఉంచి, చివరిది, ***I have been here before*** చదవడం మొదలు పెట్టేను. చాలా బాగుంది. *Dangerous Corner* కంటెకూడా చదవాలనిపించేట్టుంది. ఇప్పుడు పదిగంటలవరకూ చదివితే మొదటి అంకం పూర్తి కావచ్చును.

సిరిపురం,
7-2-51.

మిత్రుడు శర్మారావుకి,

నీ నమస్కారాలు నీకు మళ్ళీ అందజేస్తున్నాను. నేనను కొన్నట్టుగానే అయింది. నీకు నా ఉత్తరంవల్ల రావలసినంత కోపమూవచ్చింది. అయితే అసలే ఉత్తరం రాయకపోవాలన్నంత ఆగ్రహము రాకపోయినందుకు సంతోషమే.

ఇక, అసలు సంగతి, నేను నీకేమీ పెద్ద కష్టమయినపని చెప్పలేదు. ఒక శలవురోజున బయలుదేరి రమ్మన్నాను. ఇక్కడకు వచ్చిన తరవాత నీకు అంత చికాగ్గాఉంటే మర్నాడే బయలుదేరి పోవచ్చును. ఎప్పుడూ ఉన్న బాంకే కదా! ఒకటి రెండు రోజులు కొత్త మార్పుగా ఉంటుందనేనా నువ్వు రావచ్చును.

ఇంతకంటె నేను విశేషించి రాయవలసింది లేదు. నువ్వు ఈ ఆదివారంనాడు తప్పకుండా వస్తావని నమ్ముతున్నాను. రైలుకి బండీ తీసుకొనివస్తున్నాను. లేకపోతే నేనే బయలుదేరివచ్చి, నిన్ను తీసుకొనిరావలసి ఉంటుంది.

ఉదయం బండి ఇక్కడకు పదకొండు గంటలకి వస్తుంది. అందులో రావడమే సదుపాయము. మరి ఉత్తరాలకి వ్యవధిలేదు.

ఇంతే సంగతులు,
కా. కృష్ణశర్మ.

ఫిబ్రవరి 11 వ తేదీ. 1951.

ముకాం : సిరిపురం.

ఉదయం ఆరుగంటల రయిల్లో బయలుదేరి ఇక్కడకు వచ్చాను. స్టేషనుకి శర్మ బండి తీసుకొనివచ్చాడు.

బండిప్రయాణం సుమారు గంటసేపూ శర్మ తన మునసబు గిరీ గురించి, ఊళ్ళోని పార్టీల గురించీ, చెప్పాడు. అందులోను తనపార్టీ అన్నివిషయాల్లోను ముక్కుకు సూటిగా పోతున్నప్పటికీ, రెండవ పార్టీవాళ్ళు ఎంతకీ సమాధానానికిరాక, కాలికివేస్తే మెడకీ మెడకి వేస్తే కాలికీ వేస్తూ వృథాగా కక్షలుపెంచడమే పనిగాపెట్టుకొన్నారట. అవతలి పార్టీవాళ్ళుకూడా సరిగా ఇలాగే చెప్తారేమో? ఎవరి పని వాళ్ళు చేసుకొని, హాయిగా ఉండరాదూ?ఒకవేళ ఎవడయినా అటువంటివాడున్నా ఉండనియ్యరు. ఏదో ఒక పార్టీలో చేరి తీరవలసిందే. లేకుంటే రెంటికీ విరోధి కావాలి.

కృష్ణశర్మ బలంగానే ఉన్నాడు. కాని జుట్టు బట్ట గురించి ఏమాత్రమూ శ్రద్ధ ఉన్నట్టులేదు. తలకూడా నాకంటె బాగా నెరిసిపోయింది. కట్టుకొన్న పంచ ఖరీదయినదే. చొక్కాకి గుండీలు లేవు. పైమీద ఒక తువ్వాలు. మనిషిలో పల్లెటూరి కళ బాగా వచ్చింది.

ముందు తన యింటికి తీసుకొని వెళ్ళాడు. ఇల్లు చాలా పెద్దదేగాని, అంతా బూజుపట్టినట్టుంది. గోడలకు సున్నాలు లేవు. ఇంటికిముందే పశువులపాకలు. పరిశుభ్రత అనేది ఏమిటో తెలియని ప్రాంతమని స్పష్టంగా కనిపిస్తుంది. ముందు తమ యింట్లో కాఫీ ఇచ్చారు. ఆముసలావిడ వాళ్ళ మేనత్తట. ఎంతో ఆప్యాయంగా నిత్యమూ వస్తూపోతూన్న మనిషిని పలకరించినట్లుగా పలకరించింది.

కాఫీ పెద్ద వెండిగిన్నెతో ఇచ్చారు. అంత ఎక్కువగా అక్కరలేదనబోతూండగా అంతకంటె పెద్దదయిన తన గిన్నెలోని కాఫీ చూపించి నాకంటె తక్కువగానే ఇచ్చారులే. అయినా భోజనానికి ఇంకా గంటగంటన్నర వ్యవధి ఉందికదా అన్నాడు. అప్పటికి పన్నెండు కావచ్చింది. అంటే మామూలుగా మధ్యాహ్నం టిఫిను వేళకు పగటిభోజనమన్న మాట!

తాతలనాటి పెద్ద పడక కుర్చీలో (దాని పేముఅల్లిక చిరిగిపోతే బల్లలువేయించినది) నన్ను కూర్చోమని తాను పక్కనున్న బల్లమంచంమీద కూర్చున్నాడు. ఇకను, తను చెప్పదలచిన భోగట్టా ఆరంభిస్తాడు కాబోలు ననుకొంటూ ఉండగా, ఉండిప్పుడే వస్తానని ఎక్కడకో వెళ్ళిపోయేడు. ఆ వెళ్ళిపోడం మరో గంటవరకూ పునర్దర్శనంలేదు. ఈ మనిషి ఒక్కడూ ఇక్కడ ఏం చేస్తాడో అన్న ఆలోచనలేదు. కాలక్షేపానికి ఒక పుస్తకమయినా పడేసిపోలేదే!

వేళతప్పిన భోజనం. తరువాత అలవాటులేదంటున్నా బలవంతంగా నల్లులమంచంమీద పడక. మాటలాడుతూనే (అయిదు నిమిషాల్లోనే) వాడు గుర్రుపెట్టి నిద్రకు దొరకొన్నాడు. మంచం మీద మరి లాభంలేదని కుర్చీలో కూర్చున్నాను. అక్కడా నల్లులు తగుమాత్రంగా ఉన్నాయి—అయినా ఏమిటి చెయ్యడమో తోచకుండా, అథమం వచ్చిన పనిఏమిటో ఇదమిత్థమని తేలకుండా కూర్చోడం చాలా కష్టమనిపించింది. వాడు నిద్రపోయినది అరగంటసేపే అయినా ఎన్నోగంటలయినంత బాధగా తోచింది. సాయంత్రం రయిలుకే బయలుదేరిపోవాలనిపించింది.

వాడు నిద్రలేచిన తరవాత కార్యక్రమం ఒకదారినిపడినట్టయింది. మళ్ళీ కాఫీతాగినతరవాత "ఒక మారలాగా మా చెల్లెలుగారింటికి వెళ్దాము" అన్నాడు. దారిలో అసలు తను ఉత్తరం రాయడానికి ముఖ్యకారణం ఆమె ప్రోద్బలమేననీ, ఆమె భర్త పోయిన తరవాత కొద్దికాలం తమయింట్లోనే కలిసిఉండినా, అంతకంటె ఇదిమేలని ఆవిడ వేరే ఇల్లుకట్టించుకొని తనూ కూతురూ అందులో ఉంటున్నారనీ చెప్పాడు. అప్పటికీ నాకు, నన్ను బలవంతంగా రప్పించిన కారణంఏమీ ఊహాకందలేదు.

ఆవిడ మనిషినిచూస్తే వితంతువు అనుకోందికి ఏమీ అవకాశం కనబడదు. వయసు పాతికోనలభై మధ్యను ఎంతైనా కావచ్చును. ఆవిడకూడా బాగా తెలిసిన మనిషిని పలకరించినట్టుగానే పలకరించింది, తరవాత కొంతసేపు అన్నా చెల్లెళ్ల మధ్యను వాగ్వాదం. నన్ను తిన్నగా తమయింటికి తీసురావలసిందని ఆమె, ఎక్కడయితేనేమి; ఈ రాత్రికికూడా మా యింట్లో ఉండి రేపు మీయింటికి వస్తాడని అతనూ ఇద్దరూకలిసి మొత్తానికి నేను సాయంత్రమే బయలుదేరాలనుకొన్నాననేమాటను చెప్పనియ్యకుండా చేసేరు. వాళ్ళ మాటలనుబట్టి చూస్తే నేనొక వారం పదిరోజులు ఇక్కడ ఉండే ఉద్దేశంతో వచ్చినట్టుకనిపిస్తుంది.

ఈ ఇల్లు ఒక్కటే ఈ ఊళ్ళో ఎక్కడనుండో తెచ్చిపెట్టినట్టనిపిస్తుంది. ఇల్లేకాదు ఇంటిలోని సామాను, అలంకరణ అంతా మామూలుగా పట్నవాసాలలోని అధునాతనమయిన ఇళ్ళల్లో ఉన్నట్టే ఉంది. గదిమధ్య టేబిలు నాలుగు వంకలా నాలుగు కుర్చీలు ఒకప్రక్కను చిన్న టేబిలుమీద రేడియో, కిటికీలోంచి పువ్వులమొక్కలు కనిపిస్తున్నాయి. కాఫీ ఫలహారముకూడా మోతాదుగానే సాగాయి. వాళ్ళమ్మాయి-పద్దెనిమిదేళ్ళుండవచ్చును. పేరు లీల. ఇద్దరూ పక్కపక్కను కూర్చుంటే. తల్లీకూతురూ అన్నట్టు కనిపించలేదు. అక్కచెల్లెళ్ళలాగున్నారు.

ఆ విడ అనవసరపు ఉపోద్ఘాతం అట్టేలేకుండా అసలు విషయానికివచ్చింది. వాళ్ళమ్మాయిని మా మేనల్లుడు బుచ్చిబాబుకిచ్చి పెళ్ళిచేసే ఉద్దేశమట. నాకు నిజంగా కోపంవచ్చింది. ఆవిడ నా మనసులోని మాట గ్రహించినట్టు, 'పెళ్ళిమాటలకి, అందులోనూ పిల్లను ఇస్తామని చెప్పడానికి ఇది పద్ధతికాదు. మనమే అక్కడకు వెళ్ళొద్దామని అన్నాను. మా అన్నదే, కదలడానికి బద్ధకించి ఇలా మిమ్మల్ని రప్పించాడు' అంది.

ఫలహారం తరవాత కర్మ ఏదో పనిఉందని ఇప్పుడే వస్తాననీ వెళ్ళాడు. నాబస యీ యింటికి మారిపోయినట్టే. ఆ విడ మేడ మీదికి తీసుకొనివెళ్ళి "మీరు మధ్యాహ్నం విశ్రమించినట్టులేదు. కాస్త విశ్రమించండి. అన్నయ్య మళ్ళీవచ్చేసరికి ఏ సాయంత్రం అవుతుందో; ఇప్పుడే వస్తానంటాడు. ఎంతకీ మరి అయిపుఉండదు. ఈ వెధవ మునసబుగిరీ వాడిప్రాణాలు తింటూంది." అంది. గదిలో మంచం, టేబిలూ కుర్చీలు అన్నీ చక్కగా అమర్చిఉన్నాయి. గోడకి ఉన్న అద్దాల తలుపుల అలమారలో పుస్తకాలున్నాయి. ఇంగ్లీషు పుస్తకాలన్నీ పాతవే. కాని, తెలుగు పుస్తకాలు మాత్రం కొత్తవికూడా ఉన్నాయి. ఒక అరలంతా పత్రికలు దేనిసంచికలు దానికి వరసగా సర్దబడిఉన్నాయి.

ఏవో పత్రికలు తిరగవేస్తుంటే నిద్రవచ్చింది. క్రిందనున్న రేడియోకి సంబంధించి లౌడ్‌స్పీకరొకటి గదిలో ఉందన్న సంగతి అంతకుమునుపు గుర్తించలేదు. వాళ్ళునాకు మెలకువ తెప్పించడానికే పెద్ద ధ్వనితో ప్రయోగించి ఉంటారు. అందులోనూ వచ్చిన ప్రోగ్రాము నాగస్వరం. మేడమీదనే మొగం కడుక్కోందికి ఏర్పాటు చేయబడిఉంది. ఇన్నిమార్లు కాఫీతాగడం అలవాటు లేదంటున్నా ఆమె వినకుండా 'మా అన్నయ్యగారింటిలాగ పెద్ద గిన్నెలతో ఇవ్వడంలేదు. ఒక చిన్న కప్పుడు కాఫీ ఎప్పుడు తాగినా తాగవచ్చును.' అంటూ తాగించింది.

నేను చెప్పవలసినమాట ఏదో స్పష్టంగానే చెప్పాను. వాళ్ళ తల్లిదండ్రులు ఉన్నారు. కుర్రవాడుకూడా బి. యస్. సి. చదువు

తున్నాడు. వీళ్లు ఇచ్చినా వాళ్ళుచేసుకొన్నా మధ్యను నా అంగీకారంలో ఏముంది అని. కానీ, ఆమెకు ఏమీ నమ్మకం కలిగి నట్టులేదు. "మీరెలా చెప్తే వారలా చేస్తారట. పోనీ మీవంతు మీరు ఇష్టపడ్డామనండి తక్కినది మా అన్నయ్య చూసుకొంటాడు" అంది. తరవాత మాటల్లో శర్మకూడా "అదేమిటోయి అలా అంటావు? కుర్రవాడు సాక్షాత్తు నీకు మేనల్లుడు. మరి నిన్ను కాకపోతే మరెవరిని అడగమంటావు? మరి మా లీల నాకు మేనకోడలే కదా? నేనే నా పూచీ అని పూనుకొని తిరగడంలేదా? మా లీలకు నేను కట్నోటిమాటతప్ప మరేమీ ఒరగబెట్టినదిలేదు. అసలు కుర్రవాని చదువు కయ్యేఖర్చంతా నువ్వే భరిస్తున్నావుట కదా?"

ఇటువంటి ధోరణి మనుష్యులతో ఎంత స్పష్టంగా చెప్పి లాభంలేదు. అసలే చెప్పకుండా ఊరుకొంటే తమమాటని అంగీకరించినట్టే లెక్కకడతారు. తమకు సబబుగా తోచినది ఇతరులకు మరోకలాగ తోచడానికి వీల్లేదని వాళ్ళ నమ్మకం. ఏమయినా రేపు బయలుదేరేలోగా, శర్మతో లాభంలేదు, ఆ విడతో నే స్పష్టంగా చెప్పెయ్యాలి:—చదువుకి సాయంచేసినంత మాత్రాన వాళ్ళ యిష్టానిష్టాల ప్రసక్తి లేకుండా పెళ్ళిసంబంధం నిశ్చయించే అధికారంలేదని, ఉన్నా వినియోగించే ఇష్టం ఎంతమాత్రం లేదని, వివాహం అనేది, తల్లిదండ్రులూ, అంతకంటె ముఖ్యంగా వరుడూ తమ స్వంతబాధ్యతలమీద నిర్ణయించుకోవలసిన వ్యవహారం అనీను—వాళ్ళు ఏవిధంగా అర్థంచేసుకొన్నా చెప్పవలసిన మాటలు చాలుగా స్పష్టంగా చెప్పేస్తే మరి తరువాత మొగమాటముంచవలసిన పరిస్థితిరాదు. రేపు ఉదయం రైలుకే వీలుంటే బయలుదేరాలి; తప్పితే సాయంత్రం బండికి మాత్రం తప్పకూడదు.

కేనాగెన్,
17-2-51.

ప్రియమైన మామయ్యకు,

అనేక నమస్కారములు. ఇక్కడ నేను క్షేమంగా ఉన్నాను.

నీవు వ్రాసిన ఉత్తరం అందింది. మాకు మార్చి ఆఖరులో శెలవులిస్తారు. అప్పుడు నువ్వు వ్రాసిన ప్రకారం సిరిపురం వెళ్ళడానికి నాకేమీ అభ్యంతరంలేదు. అంతకుమించి నేనే మీ హామీ ఇవ్వలేను నా పెళ్ళిని గురించి. లోగడ మాఅమ్మ నాన్నా తొందర చేసినప్పటికి నువ్వు నాతో కలిసి ముందు నా చదువు పూర్తికావాలనీ, నేనునా కాళ్ళమీద నిలబడే సావకాశంకలగాలనీ అంటూండేవాడివి. అటువంటిది స్వయంగా నువ్వు ఈ విషయం రాసేవంటే, అందులోను ఆ ఊరువెళ్ళి అక్కడనుండి మరీ ఉత్తరం రాసేవంటే తప్పకుండా ఆలోచించవలసిన పరిస్థితే అయిఉంటుంది. అయితే ముందుగా అక్కడకు నీమాట ప్రకారం వెళ్తాను. అక్కడనుండి నీ దగ్గరకువచ్చి తరవాత మా వూరువెళ్తాను.

మా మిత్రుడు రాజశేఖరం ఈ శెలవులలో అజంతా, ఎల్లోరా మొదలయినవి తిరిగివద్దామంటున్నాడు. నా ఖర్చులన్నీ తానే భరిస్తానంటున్నాడు, గాని, కొంచమయినా మనది అని లేకుండా ఉంటే బాగుండదనిపిస్తుంది. ఇప్పటిమటుకు నేను వస్తానురాను అని ఏమీ అతనితో నిర్ధారణగా చెప్పలేదు. నువ్వు యిష్టపడితే, ఒక్క యిష్టమేకాదు, ఏమయినా పంపిస్తానంటే, వెళ్తాను. లేదా తిన్నగా యింటికి వచ్చేస్తాను. ఈ ప్రయాణానికి మామూలు దానికి అదనంగా ఒక యాభైరూపాయిలు ఉంటే చాలునను కొంటాను.

మొన్న నే, ఇంటిదగ్గరనుండి చెల్లెమ్మ ఉత్తరం రాసింది; అంతా క్షేమం. అమ్మకు యింకా పురుడురాలేదట. అక్కయ్యను, పండగకు తీసుకొనివచ్చి యీ ఫస్టుతారీఖునే దిగబెట్టేసేరట. తమ్ముడు రామం బొమ్మలు-చూసి, మ్యునిసిపల్ చైయిర్మన్‌గారు స్కాలర్‌షిప్పు ఏర్పాటుచేయిస్తానన్నాడట. ఈ సంగతులన్నీ నీకూ ఉత్తరం వచ్చి ఉంటుందేమో, మొన్న పండగకి నువ్వు వస్తావేమోనని చాలా చూసేరట. పో నీ మా వేసవి శెలవులలోవస్తే నాలుగు రోజులు హాయిగా చదరంగం ఆడుకోవచ్చును.

నీ ఉత్తరంకోసం ఎదురుచూస్తూ ఉంటాను.

బుచ్చిబాబు.
కృష్ణరాయపురం.
1-3-51.

క్షేమం.

శ్రీరస్తు చిరంజీవి బావమరిదికి ధర్మారావుకు. అనేక ఆశీర్వచనములు తె॥ నీవు 24-2-51 తేదీని వ్రాసిన ఉత్తరమందినది. సంగతులు చూచి మేము యావన్మంది చాలా సంతోషించినాము. చి॥ బుచ్చిబాబువద్దనుండి నిన్న నే ఉత్తరము వచ్చినది. పెండ్లి సంబంధము విషయంలో, నీకు నచ్చినది అంటే మా అందరకునచ్చినట్టే. వాడుకూడా చూసుకొన్నమీదట మరి మేమెవ్వరమూ చూడనక్కరలేదు కట్నకానుకల విషయంలోకూడా, నువ్వు ఆలోచించి ఎలా బాగుంటుందంటే అలా చేయవలెను. ఆడపిల్లలు చిన్నబుచ్చుకొంటారు గనక వాళ్ళలాంఛనాల విషయంలో మాత్రం తక్కువ చేయవద్దని మీ చెల్లెలు రాయమన్నది. ఏదో భగవత్కటాక్షమువలన ఈ వ్యవహారం స్థిరపడి, సవ్యంగా నెరవేరితే చి॥ బుచ్చిబాబు విద్యావిషయమై నీకు కలుగుతున్న ఒత్తిడి తగ్గుతుంది. అన్ని విషయములు ఆలోచించి ఎలా బాగుంటుందంటే అలాచేయవలెను. ఇక్కడ పిల్లలందరూ కులాసాగా ఉన్నారు. చి॥ రామానికి స్కాలర్‌షిప్పు దొరికింది. శ్రీ సంజీవరావు పంతులుగారు "వారాలకు ఏం తిరుగుతావు, మా యింట్లోనే భోంచెయ్యి" మన్నారట—చి॥ పిల్లలు నీవు పండగకి వస్తావనిచూసేరు. వీలుంటే ఒక పర్యాయము రాగోర్తాను! శ్రీ శ్రీ శ్రీ.

ఇంతే సంగతులు ..
గ్రహించవలెను.
కా. సోమసుందరం వ్రాలు.
సిరిపురం,
10-8-51.

మిత్రుడు ధర్మారావుకు:

మా చెల్లెలు సుభద్రమ్మ మరీమరీ తొందరచేయగా నీకిది వ్రాస్తున్నాను. మీ మేనల్లుడు కృష్ణమూర్తికి శెలవులివ్వగానే

ఇక్కడికి ఒక్క పర్యాయము వచ్చి వెళ్ళవలసినదిగా పదేపదే వ్రాయమంటున్నది.—స్వయంగా చూచేవు గనక దాని ఆందోళన నీకు తెలియనిది కాదు. కుర్రవాడువచ్చి పిల్లను చూసుకొన్నమీదట నీకు వీలుంటే ఒకపర్యాయమువస్తే కట్నకానుకల విషయం నిశ్చయంగా మాట్లాడుకొందాము. లేదా మేమే అక్కడకువచ్చి నాలుగు సంగతులు మాట్లాడుతాము. కావాలంటే మీ చెల్లెలు గారి ఊరుకూడా వెళ్తాము. మీ మేనల్లుడు చిరంజీవి కృష్ణమూర్తి ఎప్పట్లో బయలుదేరివచ్చేదీ వ్రాయగోర్తాను. వెంటనే జవాబు రాస్తావని నమ్ముచున్నాను.

ఇంతే సంగతులు,

కా. కృష్ణశర్మ.

మార్చి 15వ తేదీ 1951

ఏమీ విశేషాలు లేవు. మామూలుగా బాంకు—సాయంకాలం పార్కు దారిలో పెంగ్విన్ ఎడిషన్ హక్స్లీ *Antic hay* కొన్నాను — పుస్తకం చిత్రంగానే ఉండేలాగుంది. లోగడ చదివిన *Point Counter Pount* ధోరణికీ *After many A Summer* కీ చాలా భేదం ఉన్నట్టుంది. వాటికంటె చాలా ముందురాసిన నవలలు. ఈ ఆదివారం రాత్రికి చదవడం పూర్తి కావచ్చు.

ఉత్తరాలు: కృష్ణశర్మకీ, బుచ్చిబాబుకీ, రాసేను. రెండూ—కాపీలు. వాళ్లు రాసిన ఉత్తరాలు ఫైలుకి, ఏడికి రాస్తున్నా నన్న సంగతి వాళ్ళకి వ్రాశాను.

వాళ్లు తప్పకుండా తమ పిల్ల పెళ్ళివిషయంలో తొందర పడవలసిన మాటే. ఏడికి మంచిసంబంధం దొరికి కాస్త కట్నంయిచ్చేవాళ్ళుకుటుంబానికి లాభించడమూ వాంఛనీయ మయిన సంగతే. అయితే ఆయాసంగతులు వాళ్ళవాళ్ళ స్వంత బాధ్యతలమీద నిర్ణయించుకొంటే తరవాత మంచిఅయినా చెడ్డ అయినా ఉభయులూ కలిసి, మస్యవర్తినెత్తిని అక్షింతలు వెయ్య నక్కరలేదు. బావకిరాస్తే, నాదేముంది అంతా నీయిష్టం ఎలా బాగుంటుందంటే అలా చెయ్యి అంటాడు. కాని, నా బాగుండటంతో ఏమిటి సంబంధం? అసలే కట్నం పుచ్చుకోకపోవడం నాకు బాగుంటుంది. తాము అందుకు ఇష్టపడగలరా? కాక, ఒకవేళ వాళ్ళు యిష్టపడినా, అది తమకుతాము నష్టం చేసుకొంటున్నట్టే కమా? ఎప్పుడో వాడు ఉద్యోగంచేసి ఇచ్చేడబ్బు ఈనాడు కట్నంయీపంలో వస్తే చేదా? అందులోనూ ఇంకా పెళ్ళిచెయ్య వలసిన ఆడపిల్లలూ, చదివించవలసిన మగపిల్లలూ బోలెడుమంది ఉన్నారు. అందుచేత బావకి ఈఅంశంలో స్పష్టంగా రాయాలి. వాళ్ళకికూడా ఇందులో నా ప్రమేయం అట్టే లేదనీ, వ్యవహారం తామూ తామూ నడిపించుకొంటే బాగుంటుందనీ నిక్కచ్చిగా రాసియ్యాలి.

ఇంకా వాడుచూసి ఇష్టపడాలికదా! ఎలాగూ ఇష్టపడతాడు. తప్పక మర్నాడువచ్చితీరాలనుకున్న నన్నే అయిదు రోజులపాటు ఉంచగలిగేరు. ఆ తల్లీకూతుళ్ళు—పాపం, ఆ ఊళ్లో వాళ్ళకు సౌకర్యాలకు లోటు లేకపోయినా, వాళ్ళకు కావలసిన రకం సంఘం లేదు. ఒంటరిగా ఏదో దేశంకాని దేశంలో ప్రవాసం అనుభవిస్తున్నట్టున్నారు. అయినా ఆమాట ఒప్పుకోరు. మనుష్యులకి తాముచేసినది పొరపాటని తెలుస్తున్నా, ఇతరులు చెప్తే మాత్రం అంగీకరించాలని ఉండదు. ఆయిల్లుని విడిచిరావడం కష్టమే! కాని, డబ్బుపడితే మరొకచోట అటువంటిఇల్లు వస్తుందిగాని, అక్కడ ఎంతకాలం ఉన్నా వాళ్లు కొత్తగా వచ్చిన మనుష్యులలాగే కనిపిస్తారు. ఆవిడఉద్దేశంకోసం ఈ పిల్లకు త్వరగా పెళ్ళిచేసేసి, వాళ్ళతోపాటు తానూపోయి ఏపట్నంలోనో ఉండవచ్చునని అన్నట్టుగా ఉంది. ఎవరిఉద్దేశాలు ఏమయినా, మన నెత్తిని అక్షింతలు పడకుండా మాత్రం చూసుకోవాలి.

సిరిపురం:

12-4-51

ప్రియమైన మామయ్యకు:

అనేక నమస్కారములు. ఈరోజు ఉదయము క్షేమంగా ఇక్కడకు చేరుకున్నాను. నేను ఈసాయంత్రమే బయలుదేరుతానన్నాను. వాళ్ళు నాలుగురోజులుండి వెళ్ళొచ్చుగాని అంటున్నారు. ఏమయినా రేపు సాయంకాలంబండికి బయలుదేరడం జరుగుతుందనుకొంటాను.

న్యాయంగా మా సంచార కార్యక్రమం అనుకొన్నట్టు జరిగిఉంటే, మరొకనెల్లాళ్ళ అనంతరం అంటే మేనెల పదవతేదీ ప్రాంతంలో ఇక్కడకురావడం జరిగిఉండేది. కాని, మామిత్రుడు రాజశేఖరం తల్లిగారికి ఒంట్లో బాగులేదని టెలిగ్రాము రావడంతో కార్యక్రమం తారుమారయింది. వాడు ఇంటికి వెళ్ళాడు. నేను ఇక్కడకు వచ్చేను. వాడు మళ్ళీ అక్కడిపరిస్థితి బాగు పడ్డాక ఉత్తరం వ్రాస్తానన్నాడు. నువ్వు దయతో పంపిన అరవైరూపాయిలూ అలాగే ఉన్నాయి. వాడు నన్ను ఒక రూపాయి కూడా ఖర్చుపెట్టనియ్యలేదు. ఇక్కడికి టిక్కట్టుకూడా తీసి కొన్నాడు.

నేను రేపురాత్రి రయిలులో బైలుదేరి వస్తున్నాను.

బుచ్చిబాబు.

క్షేమం.

కృష్ణరాయపురం:

శ్రీరస్తు చిరంజీవి బావమరిది ధర్మారావుకు: 1-5-51.

అనేక ఆశీర్వచనములు. ఉ॥ ఇక్కడ మేమంతా క్షేమంగా యున్నాము. అక్కడ నీ క్షేమసమాచారం వ్రాయించ గోర్తాను. చి॥ బుచ్చిబాబు శెలవులలో తన మిత్రుడు రాజశేఖరం అనే కుర్రవానితో కలిసి దేశసంచారం చేసేతలంపుతో ఉన్నట్టువ్రాశాడు. అందులకు నీవు అనుమతించడమే కాక ఖర్చుల నిమిత్తం డబ్బు కూడా పంపించావనీ వ్రాసినాడు. తర్వాత బయలుదేరినట్టును, ఏవో రెండుమూడుప్రదేశములు చూచినట్టును ఉత్తరములు చేరినవి. తరవాత సుమారు నెలదినములనుండి వాడివద్దనుండి ఎట్టి ఉత్తరమును లేకుండుటచే మిక్కిలి ఆందోళనగా యున్నది. శెలవులుకదా యని కాలం వృథా చేసినట్లయితే తిరువాత చదువుకొనుట కష్టము కదా? వాడు ఎక్కడవున్నది ఏమిచేయుచున్నది నీకు ఉత్తరము వ్రాసినయడల వాని క్షేమ సమాచారము వెంటనే తెలియజేయ

గోర్తాను. ఇచ్చట పిల్లలందరుకూ వానికోరకు ఆతృతగా ఎదురు చూచుచున్నారనీ; వెంటనే బయలుదేరి రావలసిదనీ వానికి వ్రాయ గోర్తాను. నీ ఉత్తరంకోసం ఆతృతగా ఎదురుచూస్తూ ఉంటాము. బైటికి అనకపోయినను వాళ్ళమ్మకు వానిగురించి చాల బెంగగా యున్నది.

ఇంతే సంగతులు:
గ్రహించవలెను.
కో॥ సోమసుందరం వ్రాలు.

సిరిపురం:
1-5-51.

చి॥ తమ్ముడు ధర్మారావుకు!

మా మేనల్లుడు ఇక్కడే కులాసాగా ఉంటున్నాడు. తోడుగా మా బావమరది, అతనిస్నేహితుడూకూడా ఉన్నారు. మావాడు కవి; ఆ రెండవవాడు చిత్రకారుడు — ముగ్గురికి బాగా స్నేహం కలిసింది. ఈ పదిహేనురోజులక్రితంవరకు వీళ్ళు ఒకళ్ళ నొకళ్ళు చూసుకోలేదంటే ఎవ్వరూ నమ్మలేరు. వీళ్ళకి సమ ఉజ్జీగా ఉంది మా లీలకూడా.

అసలు రాద్దామనుకొన్న సంగతి మరిచిపోతున్నాను. మా చెల్లెలు సుభద్రమ్మ వీలయినంత త్వరలో వివాహం చేసే తలంపుతో ఉంది. మీరంతా యిష్టపడితే తను ఈ శలవు ఆఖరులోగానే, వైశాఖంలో ముహూర్తాలున్నట్టున్నాయి. జరిపించే ఉద్దేశంతో ఉంది. అందుచేత కట్నకానుకలవిషయమై నీవు వచ్చి మాట్లాడితే బాగుంటుంది. లేదా, ఫలానా అని ఉత్తరంలో స్పష్టంగా రాసినాసరే. మమ్మల్ని రమ్మన్నా సిద్ధమే. మరి అట్టే వ్యవధిలేదు కనక వెంటనే నిశ్చయించగోరుతున్నామని వ్రాయమంది — వధూవరులు పరస్పరం నచ్చడం విషయంలో మరేమీ అనుమానం లేదు గనక, సాధ్యమయినంత త్వరలో ముహూర్తం నిశ్చయపరచడం బాగుంటుంది. పెళ్ళి ఎక్కడ జరగాలి, ఏవిధంగా జరగాలి అనే విషయమంతా నిర్ణయించేభారం మీదేననీ, మీ కెలా అంటే అలా జరిపించగలవారమనీ, మా చెల్లెలు రాయమంది — ఈ ఆదివారంనాటికి నువ్వు రాగలిగితే చాలా బాగుంటుంది. నీ ఉత్తరంకోసం ఎదురుచూస్తూ ఉంటాము.

కా॥ కృష్ణశర్మ.

మే అయిదవ తేదీ 1951

ఆదివారం. ఉదయం అంతా ఒకరి తరువాత ఒకళ్లు సరసింహం, విశ్వనాథం సుబ్రహ్మణ్యం వచ్చేరు—తీరుబాటుగా ఉండి ఏమీ తోచక ఎవళ్ళయినా వస్తే బాగుండు నన్నవాడు ఎవ్వరూ కనిపించరు. కాస్త, ఏదో స్వంతంగా ఆలోచిద్దాము, ఏదో పనిచేసుకొందాము అన్నవాడు అందరూ తయారు. అందులోనూ ఒకడు వెళ్ళిపోయేడు బాగుంది, ఇక తీరుబాటుగా కూర్చుందాము అన్న సమయంలో సరిగా మరొకడు ప్రత్యక్షం. అంతేకాదు, నీకేదో పని తొందరగా ఉంది కాబోలు వంటూనే పేకాట వేసుకొందామా? అనీ ఆ మధ్యన కొత్త గ్రామఫోను ప్లేట్లు కొన్నావుట, పేసు వినలేదనీ, నిజంగా అవి వినడం పనిమీదనే వచ్చినట్లు మాట్లాడ్డం—అందరిలోనూ సుబ్రహ్మణ్యమే నయం. ముందుగా తను వచ్చిన చేబదులుపని చెప్పేసి తరువాత మాటలు మొదలు పెట్టేడు. ఉదయం ఈ విధంగా మాటలు, తన్మూలంగా భోజనం పన్నెండు గంటలు కాకుండా ఉంటే ఇవాళ పదకొండు గంటల రైల్లో కృష్ణరాయపురం బయలుదేరి ఉండేవాణ్ణి! సరే పోనీ ఇదీ ఒకందుకు మంచిదే—నాలుగు సంగతులూ నింపాదిగా ఆలోచించి ఒక నిశ్చయానికి రావచ్చును.

మనుష్యులకు ఎవరిమీదనో ఒకమీద నమ్మకం ఉండడం మంచిదే. కాని, ఆ నమ్మకం అన్నది తమ బాధ్యతలను గురించి తాము ఆలోచించకుండా ఇతరులమీద భారంవేసి ఊరుకొనే పద్ధతివల్ల మాత్రం ఎవరికీ ప్రయోజనం లేదు.

బావగారికి మంచికో చెడ్డకో నామీద యింత నమ్మకం ఉండడమే ఒక పెద్ద చిక్కుగా ఉంది. నా మాటమీద ఈ వివాహం జరిగిందంటే, తరువాత వచ్చే, మాట పట్టింపులకూ స్పర్థలకూ బాధ్యత నాదేగా ఎంచబడుతుంది. బైటికి అనకపోయినప్పటికీ. అంతేకాక, ఇది వాళ్ళ కుటుంబ శ్రేయస్సుదృష్ట్యా మంచిదా కాదా అన్నది నిర్ణయించుకోవాలి. అయితే, బచ్చిబాబు సర్వవిధాలా యిష్టపడినప్పుడు, తక్కిన కుటుంబంకోసం వాడు తన సౌఖ్యాన్ని త్యాగం చెయ్యవలసి ఉంటుందా? ఇది సైనాళ్ళకంటె వాడు కుర్రవాడయినప్పటికీ తానే స్వంతంగా ఆలోచించి నిర్ణయించుకోవలసిన వ్యవహారం. మర్నాడే బయలుదేరి వస్తానన్నవాడు నేటి వరకూ యింటికిగాని, ఇక్కడికిగాని ఉత్తరం లేకుండా అక్కడే ఉంటున్నాడంటే అక్కడి ఆకర్షణశక్తి ఎంత బలమైనదో అర్థమవుతుంది. మరి యీ ముజా మారీ వ్యవహారం లాభంలేదు. వాడికి అన్ని సంగతులూ స్పష్టంగా రాయాలి. తరువాత వాడియిష్టం—ఎప్పుడో లాభం లేదు, ఇప్పుడే ఉత్తరం రాసెయ్యాలి. ఈ వివాహం మూలంగా వాడు తమ కుటుంబానికి ఎలాదూరం అయిపోతాడో అది స్పష్టంగా రాయాలి. అప్పటికీ వాడు కావాలని చేసుకొంటే వాళ్ళ అదృష్టం ఎలా ఉంటే అలా ఉంటుంది—పెళ్ళికాక మునుపు పెళ్ళిచూపులకని ఒకపూట ఉండి రావడానికి వెళ్ళినవాడు ఇన్నాళ్ళు ఉండిపోయినప్పుడు పెళ్ళితరవాత అక్క[illegible] సిరంగా ఉండిపోడనడానికి ఏమిటి ఆధారం? ఈ సంగ[illegible] నిర్మొగమాటంగా తెలియజేసి తనయిష్టం ఏదో ని[illegible]ముకోవాలి; అది నిష్కరమే నయం కదా?

కృష్ణరాయపురం,
12-5-51.

ప్రియమయిన మామయ్యకు!

అనేక నమస్కారములు.

నీ ఉత్తరం అందిన నాటి సాయంకాలమే బయలుదేరి ఇక్కడికి వచ్చేను. దారిలో నీ దగ్గరకు రానందుకు ఏమీ అనుకోరని నమ్ముతున్నాను. ఎదురుగా మాట్లాడేకంటె ఉత్తరంలోనే నా అభిప్రాయాలు స్పష్టంగా తెలియజెయ్యగల ననుకొంటున్నాను. అసలు ఇంతకీ తెలియజెయ్యడానికి అట్టేలేదు. కారణం ఏమంటే నేను, వాళ్ళ సంబంధం ముఖ్య కుదరడం—వాళ్ళు ఇకమీద పెద్ద

ఆశాభంగం అనుకోవక్కరలేదు. లోగడ వారందరినో, ఆహ్వానించి, తీరా వచ్చినతరవాత దాసరీ నీ కన్ను లొట్ట అనకపోలేదు. ఇంతకీ వివాహం అనేది కేవలం వాళ్ళ సదుపాయంకోసం జరిగే వ్యవహారం కాదుకదా!

నిజంగానే నీ ఉత్తరం వచ్చిఉండకపోతే వాళ్ళుగాని "పెళ్ళి అనేదానికి పెద్ద ఆడంబరం ఎందుకు? పెళ్ళికొడుకూ పెళ్ళికూతురూ అంగీకరించి, మంచిరోజు కుదిరితే చాలదా" అని ఏకో రోజున ఎవ్వరూ లేకుండా పెళ్ళిజరిపించినా నా అభ్యంతరం ఉండకపోయేదేమో? అసలు నేను ఏమయినా ఆలోచించితే కదూ? నువ్వు మొదట ఈ సంబంధంగురించి ఉత్తరం రాసేవు గనక నీకు యిష్టమే. నీకు యిష్టమయినప్పుడు అమ్మకీ నాన్నకీ ఏమీ అభ్యంతరం ఉండదు. ఇంతేనా ఆలోచన. పైగా అక్కడి వాతావరణంకూడా అంత చిత్రంగా ఉంది. నాగురించి నేను ఆలోచించుకోండికి ఒక్క క్షణమయినా తీరిక ఉంటే కదూ. ఈ సందర్భంలో నా కనువిప్పు చేసినందుకు నీకు ఎంతయినా కృతజ్ఞుణ్ణి—

నేను ఈమాట చెప్పడంతో మా అమ్మావాళ్ళకూ కొంచెం ఆశాభంగం అన్నట్టనిపించింది. వాళ్ళు యిది పూర్తిగా నిశ్చయమైనట్టుగా ఊళ్ళోవాళ్ళతో కూడా చెప్పేశారు—వాళ్ళకు భవిష్యత్తులో నువ్వూ నేనూ చూడగల యిబ్బందులు ఏమీ గోచరించవు—మనం చెప్పినా అర్థంచేసుకోరు. తగిన కట్నం ఇస్తున్నప్పుడు, పిల్ల రూపసి అయినప్పుడు అడ్డు చెప్పవలసిన కారణం ఏముంటుందని. నేను ఎక్కువగా చెప్పడానికి ప్రయత్నించ లేదు—"ఏమో, మొదట నచ్చుతుందనే అనుకొన్నాను. చివరికి నచ్చలేదు. ఏంచెయ్యమంటావు" అన్నాను.

నేన్నిక్కడికి వచ్చిన మర్నాడే మా మిత్రుడు రాజశేఖరం దగ్గరనుండి ఉత్తరం వచ్చింది. వాళ్ళమ్మగారి వంట్లో కులాసాగా ఉందట. మా ఆగిపోయిన సంచార కార్యక్రమం పూర్తిగావించుకొనే, ఉద్దేశంతో రేపు రాత్రికి ఇక్కడికి వస్తున్నానని రాశాడు. ఎల్లుండి ఉదయం బయలుదేరుదా మనుకొంటున్నాము. మా నాన్నగారికి నేను చదువు అశ్రద్ధచేస్తానేమో నని భయం. కాని యీ సెల్లాకూ నిజమయిన శెలవులన్నట్టుగా తిరిగితే తక్కిన ఏడాది అంతా ఈ జ్ఞాపకంతో శ్రద్ధగా చదవడం జరుగుతుందనీ, తప్పకుండా ఫస్టుక్లాసు తీసుకొని వస్తాననే హామీ అయనకు యిచ్చి బయలుదేరు తున్నాను—ఈ ప్రయాణం చివరిభాగంలో ఢిల్లీ ఆగ్రా మొదలయినవి చూసి, శెలవు లాఖరుకి బెనారెస్ వెళ్ళిపోతాము. అందుచేత నువ్వు మళ్ళీ వెలడబ్బు అక్కడ హాస్టల్ ఎడ్రసుకే పంపించగోర్తాను. మా ప్రయాణపు విశేషాలు నోట్ చేసి ఉంచుతాను. వీటిని లోగడ పదిహేనేళ్ళ క్రితం నీ ప్రయాణపు విశేషాలతో పోల్చిచూడడం తమాషాగా ఉంటుంది కదూ! అప్పుడు నీ సంచారం గురించి ఎక్కువ ఆలోచించడమే యిప్పటి మా సంచారానికి కారణమేమో? నేనేదో మాటవరసకు "ఎప్పుడూ యిల్లూ కాలేజీ ఇంతేకంటే మరేమీ లేకుండా ఉంటేకంటే, దేశం అంతా ఒకమారు తిరిగివస్తే ఎంత బాగుంటుంది?" అన్నాను. అతను రాజశేఖరం తరవాత మరి నేను ఎన్ని అభ్యంతరాలు చెప్పినా వినిపించుకోలేదు. ప్రస్తుతానికి రాయడానికి మరేమీ విశేషాలూ లేవు.

బుచ్చిబాబు.

సిరిపురం

16-5-51

మిత్రుడు ధర్మారావుకు!

సుమారు వారంరోజుల క్రింద మా మేనల్లుడు చి॥ కృష్ణమూర్తి యిచ్చటనుండి బయలుదేరి వెళ్ళినాడు. ఇంతవరకూ ఏమీ ఉత్తరం లేదు. మా చెల్లెలు పెళ్ళిప్రయత్నాలు చేయుచున్నది— ముహూర్తంకూడా చి॥ కృష్ణమూర్తికి శెలవులుండగానే నిర్ణయించడం మంచిది అనుకొంటున్నాము—నీకు ఇక్కడికి రావడం అ సదుపాయంగా ఉంటుందనే కారణంతో నేనూ మా చెల్లెలూ బయలుదేరి అక్కడకు వస్తున్నాము—ఎల్లుండి ఉదయం రయిల్లో బయలుదేరి వస్తున్నాము — అన్ని సంగతులూ ముఖస్థంగా మాట్లాడుకోవచ్చును— ఇంతే గంతులు.

కా. కృష్ణశర్మ.

మే 18 వ తేదీ 1951

ఉదయమే కృష్ణశర్మ దగ్గరనుండి ఉత్తరం. పన్నెండు గంటలకి మనుష్యుల ఆగమనం. వస్తున్నామంటే ఊళ్ళో మరెక్కడో బసచేస్తా రనుకొన్నాను గాని, తిన్నగా ఇక్కడికే వస్తారనుకో

లేదు—వాళ్ళ ధోరణిచూస్తే, కేవలం పెళ్ళిమాటల కోసం వచ్చి నట్టులేదు—ఏదో డాక్టర్ చేత పరీక్ష చేయించవలసిన అవసరంకూడా ఉందట. హోటలునుండి తెప్పించుకొని భోజనం చెయ్యడం ఆవిడకు మరేమీ వింతగా తోచలేదు.

పెళ్ళిమాటల ప్రసక్తి మరి నిలిచిపోయినట్టే అనడంతో శర్మకి చాలా కోపం వచ్చింది. ఆవిడ మొదట కొంతసేపు ఏమీ మాట్లాడ లేదు. తరవాత తన అన్నగారి ధోరణిని సమర్థిస్తూ మాట్లాడ్డం మొదలు పెట్టినా, శర్మకంటె సబబరిగా మాటాడింది. నేను వేసిన ప్రశ్న లకు సరిఅయిన సమాధానాలు చెప్పలేక పోయేనని ఒప్పుకొంది.—నేను వేసిన ప్రశ్నలు యివి: "పెళ్ళిఅయిన వెంటనే మీరు మీ అమ్మాయిని విడిచిఉండగలరా? అసలు మీ అమ్మాయి మిమ్మల్ని విడిచిపెట్టి ఆ సమిష్టి కుటుంబంలో మనగలదా? అందులోనూ మా బావగారి ఎలిమెంటరీ స్కూలు హెడ్మాష్టరు ఉద్యోగం, ఎనమండుగురు పిల్లలుగల సంసారం. తర్వాత పిల్లలందరి చదువుల పెళ్ళిళ్ళ బాధ్యత అంతా వాడే ధరించవలసి రావడం మీకు సమ్మతంగా ఉంటుందా? వాడు చాలా తెలివయినవాడే, కాని, మీ రనుకొన్నట్టుగా పెళ్ళిచేసుకొని ఆ పల్లెటూళ్లో ఉత్సాహంతో కుప్పపట్టిపోతాడు—ఇందుమూలంగా వాడికీ మీకూ అనవసరంగా కొన్ని సమస్యలు రేకెత్తడంతప్ప, మరేమయినా ఉపయోగం ఉంటుందా?"—ఆయా ప్రశ్నలను విని ఆవిడ ఇలా అంది. "మేము కుర్రవాడు చాలా తెలివయినవాడనీ, రూపసి అనీ విని ఎంతో ఆశ పెట్టుకొన్నాము. లోగడ ఈ విధంగా ఎందరిని చూసినా, యిష్టపడని మా లీల మీవాణ్ణి చూడగానే ఎంతో సంతోషించింది—మీ మేనల్లుడుకూడా పూర్తిగా యిష్టపడ్డాడు. మీరు ఏవేవో ఊహలూ అపోహలూ చేసి, వాళ్ళిద్దరినీ ఎడంచేసేరు. ఆయా సమస్యలన్నీ ముందుగానే ఊహించలేకపోయేరా? అలా అయితే రెండువంకలా యింతటి ఆశాభంగం లేకపోవును గదా!" నన్ను మరి సమాధానం చెప్పనియ్యకుండా కృష్ణశర్మ అడ్డుపడ్డాడు, ఏదయినా, ఉత్తరాలలో ఈ వ్యవహారం జరిగేకంటె ఈ విధంగా ముఖాముఖీ మాటలలో తేలిపోడమే బాగుంది.

ఇక వాళ్ళ వైద్యం వ్యవహారం మరొకటి రెండురోజులు పట్టేలాగుంది. ఒకటి రెండు రోజులు ఉంటే ఉత్సాహంతో వచ్చినవాళ్ళు పరుపులూ వస్త్రాలు తెచ్చుకొంటే బాగుండును కదా! ఇవాళ్టి ఎలాగో సర్దుకున్నాము. పాత మడతమంచమూ, కేంపుకాటు వైటికి తీసేము. ఆవిడ యివతల మాట్లాడుతూనే అవతల మామూలుగా తమయింట్లో సర్దుబాటు చేసుకొన్నట్టే సామానులు అటూ ఇటూ సర్దసాగింది. కొద్దిసేపట్లో గదిని కొంత అందంగా తయారుచెయ్య గలిగింది — భోజనానంతరం కడుపులో నొప్పివస్తున్నాదట. ఎంత తక్కువగా తిన్నా యీనొప్పి తప్పడంలేదట. ఇక్కడ డాక్టరు పార్థసారథిగారికి చూపించడం ఉద్దేశమట. సరే

వాళ్ళిష్టం, ఇక్కడ ఈ బ్రహ్మచారి యింట్లో యిముడగలిగి వారుంటే నాకేం అభ్యంతరం. రేపు మరి సెలవు అక్కర్లేదు. మామూలుగా బేంకుకి వెళ్ళిపోవచ్చును. కొంత చికాకు తప్ప నప్పటికీ, యిక్కడికి ఈ వ్యవహారం పరిష్కార మైపోయినట్టే—బుచ్చిబాబుకి ఈ సంవత్సరంకూడా డబ్బు పంపించాలి. తర వాత సంగతి ఏమిటో అటునుంచి నరుక్కురావచ్చును వాడికీ ఎమ్. ఎస్. సి. చదివి లెక్చరరు కావాలని ఉంది. అదే మంచిదేమో, వాళ్ళ తమ్ముళ్ళ కాలేజీ చదువులవేళకు అందివస్తాడు.

సిరిపురం
24-5-51.

మిత్రుడు శర్మారావుకి!

మేము యిక్కడికి వచ్చేసరికి ఒక అనుకోని సంఘటన జరిగింది. మా మేనకోడలు లీల మా బావమరిది స్నేహితుడు ఆ చిత్రకారుడు రాజరత్నంతో లేచి వెళ్ళిపోయింది. ఎక్కడికు వెళ్ళేరో తెలియదు. అక్కడకు మీ దగ్గరకు వస్తున్నామని మేము బయలు దేరిన మర్నాడే బయలుదేరేరట. దాని ఒంటినున్న బంగారమే కాక మా చెల్లెలు పెట్లో వస్తువులుకూడా కొన్ని తీసుకొని వెళ్ళి పోయేరు. మా చెల్లెలుకి మతి చలించినట్లయింది. ఎవరితోనూ మాట్లాడ్డంలేదు. తిండికూడా సరిగా తినడంలేదు. ఏందుకు, నువ్వు ఎంతలేదన్నా, బాధ్యత నీదే. మా లీలకు మీ మేనల్లుడు రాసిన ఉత్తరం ఒకటిదొరికింది—అందులో మొన్న నువ్వు మాట్లాడినట్లుగానే సంబంధం చెడిపోయిన సంగతి నిష్కర్షగా రాసిఉంది.

ఆ ఉత్తరం అందినమీదనే అది ఇటువంటి తొందరపాటు పనిచేసి ఉంటుందనుకొంటాము. ఏంచేస్తాం, అది మరొక ఏడాదినాడు ఎటువంటి స్థితిలో ఇంటికి తిరిగివచ్చినా విశేషంలేదు; అసలు మళ్ళీ ఎన్నటికయినా తిరిగివస్తుందో రాదో? మాకే పల్లెటూరికి ఏసంగతీ తెలియదు. నీకుగాని వాళ్ళ భోగట్టా ఏమయినా ఆచోకీ తెలిస్తే రాస్తావని నమ్ముతున్నాను. లేక, ఆమాత్రం బాధ్యత ఎందుకు నెత్తిని వేసుకోడం అనుకొంటావా? మా చెల్లెలు కడుపు నొప్పి అలాగే ఉంది. మొన్నటి మాటు రావడంలో డాక్టరుగారు కొన్నాళ్ళపాటు అక్కడ ఉండాలన్నారు. నాకు ఇప్పుడు ఏమీ తీరుబాటుకాకుండా ఉంది. మరొక పది పదిహేను రోజులలో బయలుదేరివస్తే బాగుంటుం దనుకొంటున్నాను. అక్కడకు వచ్చిన మీదట ఒకయిల్లు అద్దెకు తీసుకోవాలనుకొంటున్నాను. నీకు వీలయితే ఒక చిన్నయిల్లు, శుభ్రమయినది చూస్తే చాలా సంతోషిస్తాను. మా చెల్లెమ్మ ఒక్కతే ఉంటుంది; నేను అప్పుడప్పుడు వచ్చి వెళ్తూఉంటానూ ఇంతే సంగతులు.

కా. కృష్ణశర్మ.

సిరిపురం
24-9-51.

మిత్రుడు ధర్మారావుకు!

నిన్ననే మా చెల్లెమ్మ దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. ప్రస్తుతం నా దగ్గర డబ్బు సర్దుబాటు కావడంలేదు. వాళ్ళ రైతులుకూడా ఇంకా మరికొన్నాళ్ళు పోతేనేగాని ఇవ్వలే మంటున్నారు. అందుచేత నువ్వు ప్రస్తుతానికి ఒక నూరురూపాయలు సర్దుబాటుచేసి ఇవ్వగలిగితే మరి పదిహేనురోజులలో నేను పంపిస్తాను. నువ్వు ఏసంగతీ నాకు ఉత్తరం వెంటనే వ్రాయ గోర్తాను. నీకు వీలుకాని పక్షంలో నేను మరేదయినా ఏర్పాటు చేస్తాను. ఇంతే సంగతులు.

కా. కృష్ణశర్మ.

నవంబరు 16వ తేదీ 1951

ఈరోజు పుట్టినదినం. అంటే ముప్పైఆరువెళ్ళి ముప్పైఏడవ సంవత్సరం వచ్చిందన్నమాట. ప్రతిసంవత్సరం మామూలుగా జరిగేదే. ఈ సంవత్సరం కొంచెం కొత్తపద్ధతిగా జరిగింది. నిన్న సాయంత్రం మాటలసందర్భాన ఆవిడతో రేపు నా పుట్టినదినం అనడంవల్ల వచ్చిందిచిక్కు. ఆఫీసుకి శెలవుపెడితేనేకాని ఒప్పుకోలేదు. భోజనంకూడా వాళ్ళింట్లోనే చెయ్యవలసి వచ్చింది. హోటలునుండి మూడుతీపిపదార్థాలు తెప్పించింది. తానుస్వయంగా సేమ్యాపాయసమూ పెరుగు గారెలూ చేసింది. వెనుక సుశీల ఉండిన రోజులు జ్ఞాపకంవచ్చి కళ్ళలో నీళ్లు తిరిగేయి.

ఇటీవల ఈ రెండుమూడునెలలలోనూ ఆవిడ ఇంత ఉత్సాహంగా ఉండడానికి ఇదే ప్రథమం. రోజంతా అక్కడే గడిచిపోయింది. అసలు ఇదొక అలవాటయిపోయింది. ఉదయం ఒక గంటసేపూ, సాయంకాలం ఆఫీసునుండి రావడమే తిన్నగా అక్కడకు వెళ్ళడమూ, ఎనిమిది, ఎనిమిదిన్నరవరకూ అక్కడే కూర్చోవడం. మొదట్లో ఆమె ఆరోగ్యంగురించి, మందుమాకుల గురించి కనుక్కోవడం అవసరమయితే కావచ్చునుకాని ఇటీవల రోజూ ఉదయం సాయంత్రం వెళ్ళి అంతసేపు వెళ్ళి కూర్చోడానికి ఏమిటి అవసరం ఉంది. కేవలం చేసేదీ వినడమున్నది ఒక పెద్ద కారణం కాదుకదా? ఎంతసుంది ఇరుగుపొరుగు ఇళ్ళలోలేదు లేడికాదా? కాక, అంతగా కావాలంటే ఒకటి రెండుసార్లు కూడదా? లేకపోతే అనవసరమయిన వదంతులకు ఆధారం కల్పించినట్లవుతుంది.

అందులోనూ ఆవిడ ఈ సాయంకాలం ఇచ్చిన వాచీ పుచ్చుకోకపోవలసింది. అది కొత్తదయినా బాగా లేకపోవును. వెనుక ఆమె భర్త పెట్టుకొనేవాడట. అది ఇన్నాళ్లూ భద్రంగా పెట్టెలో ఉంచికీ యిస్తూ వచ్చిందట — అటువంటి ప్రియమయిన వస్తువు, అంతఖరీదయినది ఎవరో నాబోటివానికి యివ్వడం ఆమెది తప్పే. కాని, ఇచ్చిందే తడవుగా పుచ్చుకోడం నాదే పొరపాటే — కాని, ఆమెయిస్తూఉంటే కాదనగలిగేటంత శక్తి లేకపోయింది. ఇక, అది మరి తిరిగిఇస్తే బాగుండదు — ఆవిడ పుట్టిన దినమో లేక మరొక అవకాశమో చూసుకొని, ఏదయినా తగిన వస్తువు బహూకరించాలి. దీనికి ప్రతిఫలంగానే చేసేమన్న ఉట్టిపడకూడదు. అలా అయితే ఆమె పుచ్చుకోకపోవడమే కాక నవ్వుతుంది — ఆమెమాటలనుబట్టిచూస్తే మళ్ళీ నెల సిరిపురం వెళ్ళిపోయేఉద్దేశం ఉన్నట్టుంది. అవునుమరి, ఏదో నా కోసమని ఇక్కడ అనవసరపు ఖర్చులు పెట్టుకొని ఇబ్బందిపడేకంటే, అక్కడ స్వంత యిల్లుంది, దేనికయినా కావలసినవాళ్ళు అన్నదిమున్నారు! ... ఆమె వెళ్ళిపోతే మళ్ళీ కొన్నాళ్ళు ఒంటరిగా ఉన్నట్టుంటుంది — మనిషి సాంఘిక జంతువన్నమాటలో ఎంతో సత్యం ఉంది. ఎంతగా ఒంటరితనానికి అలవాటుపడినమనిషి అయినాసరే, కొద్ది రోజులపాటు స్నేహం కలిసేటప్పటికి మరి విడిచి పెట్టలేడు. ఇప్పుడు వాళ్ళింటికి రోజూ వెళ్ళి కొంతసేపు విచారించి రావడం ఆవిడ కోసమో నాకోసమో అనుమానం వచ్చేలాగుంది — కళలగురించి గాని, రాజకీయాలగురించిగాని అంత చక్కగా మాట్లాడే ప్రజ్ఞ ఆడవాళ్ళలోనేకాదు, మగవాళ్ళలోకూడా అతి అరుదుగా చూస్తాము.

ఆవిడకుమార్తెని పెళ్ళి చేసుకోకపోవడంలో బుచ్చిబాబు నిజంగా చాలా నష్టపోయేడు. అయితే ఆ నిశ్చయానికి బాధ్యత వాడిదే — నేను చేసినదల్లా ఉన్న సాంఘికబాధ్యతలు తెలియజెయ్యడంమాత్రమే — ఒక్కొక్క కుటుంబం బాగుపడడానికి ఒకమనిషి తన సౌఖ్యాన్ని కొంతవరకూ త్యాగం చెయ్యాలి మరి—

ఆవిడ మనిషిలోని వైచిత్ర్యం ఇదే — తనకు ఒక కూతురు ఉండేదని, ఆ అమ్మాయి పెళ్ళిప్రయత్నమే తన ప్రధాన కర్తవ్యమని ఉండేదనీ—ఆసంగతే మరిచిపోయినట్లుంటుంది. ఎల్లప్పుడూ ఇలా ఒంటరిగా తను ఉంటూఉండడమే అలవాటయినట్టు మాట్లాడుతుంది. అయితే మళ్ళీ అక్కడ ఆ పల్లెటూళ్ళో ఆయింట్లో వెళ్ళి ఉండడం సంభవిస్తే, యింతలా మరిచిపోవడం సాధ్యంకాదేమో? మళ్ళీ కడుపునొప్పి రాకపోయినా, కూతురు వెళ్ళిపోయిన

కొత్తలో వచ్చిన స్తబ్ధత్వమువంటిది అంతకంటె ముమ్మరంగా కావచ్చును—

గత సంవత్సరం పుట్టినదినం నాటికి ఈ మనుష్యులు ఉన్నారనే తెలియదు. కృష్ణశర్మనిగూర్చికూడా వాడి ఉత్తరం వచ్చేవరకూ ఎటువంటి ఆలోచనా లేదు. అటువంటిది సుమారు ఈ పది నెలలకాలంలోనూ వాళ్లసమస్యలు కొన్ని నన్నూ పట్టుకొన్నాయి. మావాడు బుచ్చిబాబు వాళ్ళతో ఆ జన్మాంతం తెగని సంబంధం కలియవలసిన పరిస్థితి ఏర్పడి మళ్ళీ ఏమీ లేకుండా ఎవరిదారి వారిదయింది — మరి కొద్దిరోజుల్లో ఆవిడ వాళ్ళఊరు వెళ్ళిపోవడంతో నాకూ వాళ్ళకూ మరి ఏమీ సంబంధం ఉండదు. ఉత్తరం రాయవలసిన అవసరంమాత్రం ఏముంటుంది?

నెరిపురం:
10-2-52.

మిత్రుడు శర్మారావుకి:

నన్ను పెళ్లికి పిలవనందుకు "బావగారికి" అనిసం బోధించలేదు. నాకు నిజంగానే కోపం వచ్చింది. నీకు మొదటినుండీ ఉన్నదే యీగుణం — చేసేపని చాపకింద నీరులా చేస్తూఉండడమూ బైటికి ఏమీ తెలియనట్టు ఉండడమూను. కాని, నీనుండి ఇంతలో యీ గుణం మా శాస్త్రికికూడా ఎలా సంక్రమించిందో నాకర్థం కాకుండా ఉంది. ఎంత రిజిస్ట్రేషన్ మారేజి అయితేమాత్రం! మీ ముందుచెప్పినందువల్ల ఏమీ అభ్యంతరం లేదుకదా! నాకు ముందుగా రాయనివాడివి మీ అక్క చెల్లెలువాళ్ళకిమాత్రం రాసేవుంటావేమిటిలే — ఏమయినా మీ ఉభయులూ ఇక్కడికి వచ్చి పిలిస్తేనే గాని నేను మీయింటికిరాను.

ఇక, మీ యిద్దరికీ వేర్వేరు ఉత్తరాలు రాయడం ఎందుకని ఇందులోనే రాస్తున్నాను. మా చెల్లెలు రాసింది, యింటిని ఎవరికయినా అమ్మివేసేసంగతి — మరి ఎలాగూ ఉండనప్పుడు తప్పకుండా అమ్మివేయవలసిందే. అయితే నాకు మా చెల్లెలు ఆయిల్లు కట్టించిననాటినుండీ అటువంటి యిల్లు కట్టించుకోవాలని ఉండేది. కాని, చెల్లెలునుచూసి అన్న యిల్లు కట్టించేడంటారని ఊరుకొన్నాను. ఆయిల్లు నేనే తీసుకొంటాను. అలాగని మీకేం నష్టం చేస్తానని భయపడనక్కరలేదు. మామూలుగా అమ్మజూపి, ఎంత ధర వస్తుందోచూసి, ఆధరకే నేను తీసుకుంటాను. ఈ వ్యవహారం పరిష్కరించుకోనే నిమిత్తమయినా మీ రిక్కడికి రావాలి.

ఇంకా నిశ్చయంలేదుగాని, చిన్న సంగతి ఒకటి తెలిసింది. మనలీల అతగాణ్ణి సక్రమంగానే పెళ్ళి చేసుకొందనీ, అతగాడు మద్రాసులోని ఏదో సినిమాకంపెనీలో పనిచేస్తున్నాడనీ వార్త. అయితే ఇంకా నమ్మలేం. ఏసంగతీ రూఢిగా కనుక్కొని రాయవలసిందని, అక్కడ ఉన్న మన హయగ్రీవరావుకి రాసేను — వారం పదిరోజుల్లో జవాబు రావచ్చును. నామటుకు నిజమే అయి ఉంటుందనిపిస్తుంది. మా మేనల్లుడికి అదృష్టం లేకపోయిందిగాని, మా లీల చాలా ప్రపంచజ్ఞానం కలిగినపిల్ల. దానిని చేసుకొన్నవాడెవడూ చాదస్తంగా తెలివితక్కువ పనులు చెయ్యడు.

మేనల్లుడికి సంసారబాధ్యత నెత్తిని పడుతుందని భయం. నువ్వు స్వంతవిషయంలో అంతగా [illegible] తెలియకుండా సుస్థిరమయిన బాధ్యతను స్వీకరించినందుకు అభినందించకుండా ఉండలేకపోతున్నాను.

మీ రెప్పుడు బయలుదేరివచ్చేదీ ముందుగా రాస్తారుకదూ. మద్రాసునుండి వచ్చిన భోగట్టా నిజమయితే, వాళ్ళ దంపతుల్ని రమ్మనడంగాని, లేక మీ దంపతులు అక్కడికి వెళ్ళడంగాని జరిగించవచ్చును.

ఇంతే సంగతులు,
కా. కృష్ణశర్మ.



# పాంథగతి



★

శ్రీ బోయి భీమన్న

అడుగు లనంతముగా పడుచున్నవి;
  గడచి పోవుచున్నవి పొలిమేరలు;
అడు గడుగున, గతి పొడుగు పొడుగునా
  ఆశ గొల్పుచున్నవి పూలు;
ప్రొద్దు జారిపోవుచున్న, దూళులు
  పద్దుమణిగిపోవుచున్న; వైనన్
నాతో నను గొనిపోవకుండ నే
  నడిచిపోవుచుంటిని, సఖియా!

*   *   *   *

సంధ్యారాగము గ్రోలిన పువ్వుల
  నజ్జలు నింపుదు రెవరాకడల?
బాల మామిడుల వెన్నెల నీడల
  పడకలు పరిచెదరీ కడల!
తారలదారులు వెదకుకొనుచు, గీ
  తాలు పాడుకొను గళమాధురి, కే
వీణాతంతువు మేళవించెనో!
  విశ్వమె పేరంటా లయ్యెన్!!

*   *   *   *

మల్లెపూల పానుపవలె వెన్నెల
  మధురభావముల రేకెత్తించెన్;
కమ్మని గాలికి కదిలే పువ్వులు
  కదలని నాయెద నుడికించెన్;
కదలిరాదు నీ వదనము నాయెద
  నుదయాచలమటు రాత్రి వచ్చినన్!
కమల మగుచు, కల్హార మగుచు, నీ
  కనుసన్నలనే పఠియించెన్!

*   *   *   *

సుందర శారదరాకా చంద్రుడు
  సొంతముగా మిత్రుడు కాగాగన్,
పొంత పొటమరించిన తొగ తోటలు
  పుడమి నాకసమ్ముగ మార్చెన్!
పగలు, రేయి మధ్యను నాగుండియ
  పగిలిపోవుచుండినదే, చెలియా!
వేళ మించిపోవకముందే, నీ
  ఏటికి వెన్నెల తేలేనో!

*   *   *   *

పాడురోజులని పలవించెదనో?
  పారబోసి కొందును కన్నీటిని
సుమకాలము రేపే రావచ్చును;
  శోభా నిలయమె కావచ్చున్;
ఒలికిన కన్నీరొక బొట్టైనిన్
  విలువకెన్ని జీవన వాహినులో!
ఎడారిలో తోటలు పెంచనిచో,
  ఇంక నిమ్ము నామనుగడనే!

*   *   *   *

సారాహార సమార్జన ప్రేల్లది,
  సన్మానము పూవులది!
మధు సంపాదన మధుప శ్రేణిది
  మాధుర్యానుభవము మనది;
తరుణోదయ సౌందర్యము నీయది,
  సురుచిర సరసోద్ధతి నాది;
కష్ట మొక్కరిది, ఫలమింకొకరిది
  కాంతా, నైజమె సృష్టికిది??

*   *   *   *

పారావారము జీవిత మందునా
  ప్రకాశింపు మొక రత్నరాశివై;
అంధకార మవకాశ మందునే,
  అవతరింపు మా సుప్రభాతమై

భావి అగమ్య, మగోచరమందువె,
బంధింపుము మణిమేఖలవై
నాజీవన రాజీవ ముఖమ్మున
నవభానూదయ మీవు చెలీ!

* * * *

రసాలరమణి విదల్చి చిరాకులు,
కిసాలములతో ముస్తాబైనది;
ఎండిన దండలు త్రెంచి, ద్వారముల
ఎర్రని ముద్దులు గ్రుచ్చినది!
ప్రాతరాల్చి, క్రొత్తను తలదాల్చుట
ప్రాణికి నైజము కావున, మగువా!
నిమిష నిమిషమును నవ శీధువుతో
నింపుమా నన్ను నన్నెల్లన్!

* * * *

ఉషఃకాలమని పువ్వుల చేతులు
ఉక్కిరి బిక్కిరిగా గిలిగించెన్,
వలపు కాక నిట్టూరుపు గాడ్పులు
చలి దీరగ గాచెన్!
తలుపు త్రోసికొని తరుణోదయమే
కలలు తుడిచి, కన్నులు ముద్దాడెన్;
పేదగుడిసెయో—భాగ్యసౌధమో—
ఏమైతే మటుకేమిటె, సకియా?

* * * *

కొమ్మలపై శుక పిక సంతానము
కువకువ లాడెన్, ఓ చెలియా!
కొండ కొలకులో కువలయ మేదో
కోరికలంపెనె, ఓ చెలియా!
బాల సూర్యభగవానుని దూతిక
ద్వారము కడనిల్చెనె, పళ్లెముతో!
ఉంకువతో నవభావోద్దీపన
కుంకుమ పెట్టవె నానొసటన్!!
ప్రతిరోజుకు గల సూర్యోదయమే,
ప్రతిగుండెకుగల రాగోదయమే
మహిత మంచు మధురామృత మేదో
మనకని తెచ్చిన దీవేళ;
అందుకొంటి పాత్రము, పాత్రము చే;
అంత రంగమున భద్రపరచితిని
ఏవిడిదిని నిను కలిసి కొందునో
ఇంత మెల్లిగా పయనింతున్!!



# వాణి



శ్రీ బెజవాడ గోపాలరెడ్డి

బోట్టుబొట్టు వానయై ఆకాశ మేఘము దిగి వచ్చును—తన్ను పట్టించుకొనుటకు మట్టి వద్దకు. అటులనే ఎచ్చటనుండో ఆడవారు పట్టు బడుటకు భూమికి వచ్చెదరు.

వారికి జగత్తు కొద్దిపాటి పరిమితి గలది, కొద్ది మంది మనుష్యులది. వాటిలో తమ సకలమును పట్టించుకొన కోరుదురు—తమ సకల వ్యవహారములు, సకల వ్యథలు, సకల ఆలోచనలు. అందుననే వారికి తలపై మేలిముసుగులు, చేతికి మురుగులు, ముంగిలిలో కంచెలు. ఆడవారు స్వల్పపరిమితి స్వర్గములో యింద్రాణులై వెలయుచున్నారు.

కాని, ఏదో దేవతయొక్క కౌతుకహాసము వలె అపరిమితమగు చంచలతను వెంటకొని మా పల్లెయందు ఆ చిన్నపిల్ల పుట్టినది. తల్లి కోపముతో ఆమెను "దొంగ పిల్ల" అంటుంది. తండ్రి నవ్వుతూ "పిచ్చిది" అంటాడు.

ఆమె పరువెత్తిపొయ్యే సెలయేటి నీళ్లవలె, ఆజ్ఞలు అను రాతిబండలను నిర్లక్ష్యము చేసి వెడలుచుండును. ఆమె మనస్సు వెదురు చెట్టు కొనకొమ్మ ఆకువలె గలగలమంటూ కదలిపోవు చుండును.

## 2

నేడు ఆ పోకిరి పిల్ల వసారాకమ్ముల పై భారము మోపి నిశ్శబ్దముగ నిలువబడి యుండుటను చూచితిని. వర్షాంతపు ఇంద్ర ధనుస్సు అన్నా అనవచ్చును. ఆమె పెద్దపెద్ద రెండు నల్ల కన్నులు నేడు అచంచలములు... వర్ష దినమున కానుగ కొమ్మల, రెక్కలు తడిసిన జంటగువ్వల వలె.

ఆమెను ఇంత మౌనముగ ఎప్పుడు కాంచలేదు. నది పోతూ పోతూ ఒక చోటికి వచ్చి నిలిచిపోయి కొలను అయినదా అన్నట్లుండెను.

## 3

కొద్ది దినముల ముందు, ఎండ ఏలుబడి తీవ్రముగ యుండెను. దిగంతముల ముఖములు పాలిపోయెను. చెట్ల ఆకులు పచ్చబారి, ఎండిపోయి, నిరాశులై పోయినవి.

అంతలో, హఠాత్తుగ నల్లని వేషాలతో, వెర్రి కేకలువేస్తూ మేఘాలు ఆకాశపు ప్రతికోణమునందును వసారాలు వేసుకొన్నవి. సూర్యాస్తపు అరుణ కిరణ మొకటి, ఒరలో దాగియుండిన కత్తివలె, బయట కాన్పించుచుండెను.

నడిరేయి లేచి చూచునప్పటికి తలుపులు దబదబ కొట్టుకొనుచు ఊగిపోతుండినవి. తుపాను గాలులు సమస్త నగరపు నిద్రను శిగబట్టి తన్నుచున్నట్లుండెను.

లేచి చూచుసరికి, వీధిలోని దీపాలు కైపెక్కిన వాని గుండ్రని కనుగుడ్లవలె కాన్పించెను. క్రైస్తవుల గుడి గడియారము చప్పుడు, వర్ష శబ్దముల దుప్పటిని కప్పుకొని వచ్చెనా అనిపించుచుండెను.

ప్రొద్దున జలధారలు యింకా దట్టములైపోయెను—ఎండ మరి తలచూపలేదు.

## 4

ఈ వర్షములో మా పల్లె చిన్నపిల్ల వసారా కమ్ముల పట్టుకొని మౌనముగ నిలిచియుండెను.

"అమ్మ పిలుస్తున్నది" అని చెల్లెలు వచ్చి చెప్పెను. వేగముగ ఆమె తల ఊపెను. ఆమె జడ

ఊగుచు వ్రేలాడెను. కాగితపు పడవలతో తమ్ముడు వచ్చి ఆమె చేతిని లాగెను. ఆమె చేయి జాడించి వద లించుకొనెను. అయినా తమ్ముడు ఆటకొరకు చెయ్యి లాగుతూనే యుండెను. చెంపదెబ్బ చురుకుగ పడింది వానికి.

5

వాన కురుస్తూనే యుండినది. చీకట్లు ఇంకా మూగి దట్టమై పోయినవి. పిల్ల కదలక నిలిచియే యుండెను.

ఆది యుగమున, సృష్టిముఖమున, తొలిమాట వినిపించెను. నీరముల భాషయందు సమీరముల కంఠమున, లక్ష కోటి వత్సరముల అతిక్రమించి, స్మరణ, విస్మరణలకు అతీతమైన ఆ తొలిమాట నేడు మేఘాల కల స్వరమున వచ్చి ఆ పిల్లను పిలిచెను. అందువనే ఆమె అన్ని అడ్డుల వెలుపలికి వెళ్ళిపోయి తన్ను తాను మరచిపోయినది.

ఎంత దీర్ఘకాలము, ఎంత విశాలమైన జగత్తు, పృథ్వియందు ఎన్ని యుగముల ఎన్ని జీవనలీలలు! ఆ దీర్ఘత, ఆ విశాలత నేడు ఆ పోకిరిపిల్ల ముఖమువైపు మేఘచ్ఛాయలతో, వృష్టి కలకు శబ్దములతో చూచు చుండెను.

అందువనే ఆమె రెండు పెద్ద నల్ల కన్నుల ఆర్చక మౌనమున నిలిచి ఉండిపోయెను—అనంత కాలముయొక్క ప్రతిమ రీతి.

(అనువాదం—రవీంద్రుని "లిపిక" నుండి)

---



Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press
No. 7, Thambu Chetty Street, Madras. Editor: S. Sambhu Prasad.

శ్రీరస్తు—శ్రీ త్రిపురసుందరీ పరశివాభ్యాం నమః

# శ్రీవిజయనామ సంవత్సర పూర్ణశాస్త్రీయ (ఆంధ్రపత్రికా) పంచాంగమ్

## బ్రహ్మశ్రీ శ్రీమత్పిడపర్తి చినపూర్ణార్య సిద్ధాన్తిన స్తృతీయపుత్రేణకృష్ణమూర్తిశాస్త్రిణాప్రణీతం

విఘ్నేశ విధిమార్తండచంద్రేంద్రోపేంద్రవందిత । నమో గణపతే తుభ్యం బ్రహ్మణాం బ్రహ్మణ స్పతే ॥
వేదమయీం నాదమయీం బిందుమయీం పరపదోద్యదిందుమయీం
మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీం నౌమి విశ్వవికృతిమయీం ॥

### గమనిక

ఈ సంవత్సరమున రాజును మంత్రియు చంద్రుడే అయెను. శ్రీకృష్ణుడు పశుపాలకుడు. ౫ కుంచములు వర్షము, సర్వసస్యసముదాయమును ౧౬ వీసములలో ౧౧ వీసముల పంటయు గలుగును.

ఆషాఢ శు ౧౫ ఆ. న ముచ్యమానోదయ చంద్రగ్రహణమున్ను, పౌష శు ౧౪ సో. న గ్రస్తాస్తమయ చంద్రగ్రహణమున్ను సంభవించును.

చైత్ర బ ౧౦ గు. న నర్మదానదీ పుష్కరప్రవేశము.



### మౌఢ్యములు

చైత్ర బ ౯ బు. ప్ర॥ అధిక వైశాఖ శు ౨ బు. ప॥ శుక్రమౌఢ్యము. అధిక వైశాఖ బ ౧౪ మం. ప్ర॥ నిజవైశాఖ బ ౧౨ సో. ప॥ గురుమౌఢ్యము. తిరుగ మార్గశిర బ ౯ మం. ప్ర॥ మాఘ బ ౯ శ. ప॥ శుక్రమౌఢ్యము.

| | |
|---|---|
| కల్యాద్యబ్దాః | ౫౦౫౫ |
| శాలివాహనశకః | ౧౮౭౫ |
| ఫసలీ సన్ | ౧౩౬౨-౩ |
| హిజరీ సన్ | ౧౩౭౨-౩ |
| క్రీస్తుశం. | 1953, 54 |

శ్రీ శ్రీ శ్రీ

## ఆంధ్రపత్రికా కార్యాలయము, మద్రాసు 1.

### పంచాంగపద్ధతి ప్రశంస

భారతదేశమున గ్రహసంచారాది గణితమును బోధించు సూర్యాదిసిద్ధాంతములు అనాదికాలమున రచింపబడినవి. తరువాత నాయా సిద్ధాంతములచే సాధింపబడిన గ్రహసంచారాదికము ఆకసమునందు సరిపడక అంతరము గలుగుచుండ తత్తత్కాలమందున్న గ్రంథకర్తలు ఆ అంతరములను గనుగొని సంస్కరించుచుండిరి. అట్లు సంస్కరింపబడు అంతరమునకే బీజసంస్కారమని పేరు. ఆ బీజసంస్కారమున్ను ఒక్కొక్క రొక్కొక్కవిధముగ కాలభేదముచే గనుగొనిరి. అట్టి బీజసంస్కారసహితములగు గ్రంథములును పంచాంగములును భారతదేశమున పలువిధములైనవి. ఒక్కొక్క దేశమునందొక్కొక్క పద్ధతి పంచాంగము వ్యవహరింపబడుచుండెను. అది వారివారి ఆచారసిద్ధమయ్యెను. మనదేశమున ఆచారసిద్ధమగు పంచాంగపద్ధతి మనపూర్వపద్ధతి. ఇది యిట్లుండ మనదేశమున అట్టి సంస్కారముల గనుగొను పరీక్షకులు యంత్రసామగ్రియు ఇటీవల తక్కువయగునపుడు విదేశములందు పరీక్షకులు సూక్ష్మయంత్రసామగ్రిచే గ్రహగతుల పరిశీలించి గ్రంథములను రచించిరి. గ్రహనక్షత్రసంచారమునున్ను ప్రకటించుచుండిరి. వాటింబట్టి నూతనమార్గమున చేసిన పంచాంగములు ఆకసమున సరిపడుచున్నవి. ఇవియే దృగ్గణిత పంచాంగములు. భారతదేశమునందిట్టి (అబ్జర్వేటరీ) దృగ్గణితపంచాంగము మద్రాసు నగరమునుండి యే తొలుదొల్త క్రీ. శ 1869 నుండి ప్రకటింపబడెను. మహారాష్ట్రదేశమునందును ఆ సంవత్సరమునుండియే ప్రకటింపబడెను. ఈపద్ధతి క్రమముగ నన్నిదేశములందును వ్యాప్తినొందినది. అట్టి దృగ్గణిత పద్ధతియందు మేషారంభమునుగూర్చి చాల వివాదములు గలిగినవి గాని, అందు చిత్రాపక్షమ్మునకు ఖాశ్వ్యాది బహుప్రమాణసిద్ధమై వైదికమైనదగుటచే భారతదేశమునందంతటను అనేకులగు పంచాంగకర్తలు అట్టి వైదికాశ్వ్యాదిని బట్టి దృగ్గణితపంచాంగములను రచించి ప్రకటించుచున్నారు. ఈ పంచాంగములందలి గ్రహసంచారము జాతకాదులందు బాగుగ రుజువిచ్చుచున్నది. కావున నే దేశమందంతటను దృగ్గణితపంచాంగములు వ్యవహరింపబడుచున్నవి. వినను కొన్ని కర్మలపట్ల కొందరు పూర్వపద్ధతి పంచాంగమునకై నిరీక్షించుచున్నారు. కావున నిందు పూర్వపద్ధతిచేసైన తిథులున్ను తిథినిర్ణయములున్ను గూడ వేరుగ చూపబడినవి. దృగ్గణితపద్ధతి పంచాంగమే పూర్ణశాస్త్రీయము. అందు సాయనమానముచే ఋతువులు మార్పుచెందినవి. అట్టి ఋతుపరిణామమునుగూర్చి లోకమాన్య బాలగంగాధరతిలకు మొదలగు విమర్శకులు విశేషముగ వ్రాసియున్నారు. ఆ ప్రకారము ఋతుపరిణామమున్ను సూచింపబడినది. వర్షములు ధరలు దేశక్షేమాదికమున్ను విమర్శించి వ్రాయబడినవి. ఇందుగల ప్రతి విషయమున్ను విమర్శించి శాస్త్రప్రమాణసిద్ధమగు నదియే వ్రాయబడినది.

శ్రీః శ్రీః శ్రీః

## దేశాంతర చక్రము

| పట్టణములు | మేష తులా | వృష కన్యా | మిథున సింహ | కర్కాటక | వృశ్చిక మీన | ధనుః కుంభ | మకర |
|---|---|---|---|---|---|---|---|
| శృంగేరి | ౭౫ | ౬౩ | ౬౯ | ౮౧ | ౫౬ | ౫౧ | ౪౯ |
| మైసూరు | ౫౦ | ౭౦ | ౭౮ | ౬౨ | ౪౦ | ౩౨ | ౨౮ |
| బెంగుళూరు | ౪౨ | ౫౧ | ౫౮ | ౭౧ | ౩౩ | ౨౭ | ౨౩ |
| అనంతపురం | ౪౨ | ౪౬ | ౫౧ | ౫౩ | ౩౬ | ౩౩ | ౩౧ |
| కర్నూలు | ౩౬ | ౪౦ | ౪౨ | ౪౩ | ౩౪ | ౩౨ | ౩౧ |
| నెల్లూరు | ౧౬ | ౨౩ | ౨౬ | ౨౯ | ౧౦ | ౬ | ౫ |
| హైదరాబాదు | ౩౨ | ౩౧ | ౩౧ | ౩౦ | ౩౩ | ౩౩ | ౩౪ |
| తంజావూరు | ౨౬ | ౪౦ | ౫౧ | ౫౪ | ౧౪ | ౪ | ౦ |
| కంచి (కామకోటి) | ౨౦ | ౨౯ | ౩౬ | ౩౯ | ౧౧ | ౩ | ౧ |
| వరంగల్లు | ౨౪ | ౨౩ | ౨౩ | ౨౨ | ౨౫ | ౨౫ | ౨౭ |
| బెజవాడ | ౧౨ | ౧౩ | ౧౪ | ౧౪ | ౧౧ | ౧౦ | ౧౦ |
| చెన్నపురి | ౧౫ | ౨౪ | ౩౦ | ౩౩ | ౭ | ౦ | ౩ |
| కుంభకోణం | ౨౩ | ౩౬ | ౪౬ | ౫౧ | ౯ | ౨ | ౫ |
| విజయనగరం | ౧౭ | ౧౮ | ౨౦ | ౨౨ | ౧౪ | ౧౨ | ౧౦ |
| బరంపురం | ౩౦ | ౩౪ | ౩౮ | ౪౦ | ౨౭ | ౨౨ | ౨౦ |
| రంగూన్ | ౧౪౫ | ౧౪౫ | ౧౪౪ | ౧౪౪ | ౧౪౫ | ౧౪౭ | ౧౪౭ |

## రాజమండ్రినుండి స్వగ్రామమునకు మార్పుట

రాజమండ్రినుండి ఆయా పట్టణములకు మేషాదిసాయనమాసములందుగలుగు దేశాంతరవిఘటికలు పైచక్రమునందు గలవు. ఆయా రాశ్యయనప్రవేశము మొదలు ఆయారాశి సాయనమాసము లగుచుండును. పై దేశాంతరవిఘటికలు సాయనమాసారంభమునందగును. స్వగ్రామమునకు సమీపమందున్న పట్టణమునకు అభీష్టసాయనమాసమందగు దేశాంతర విఘటికలను పంచాంగతిథ్యాదులందు నల్లని రేఖకు పైనున్న వాటిని తీసివేయవలెను. క్రిందనున్న వాటిని కలుపవలయును. అట్లుచేయగా స్వగ్రామములకు తిథ్యాదు లగుచున్నవి.

## మేషాది నిరయనరాశి ప్రమాణములు

| | | | | | |
|---|---|---|---|---|---|
| మేషము | ౪-౨౨ | సింహము | ౫-౧౬ | ధనుస్సు | ౫-౧౮ |
| వృషభము | ౫-౧ | కన్య | ౫-౧౩ | మకరము | ౪-౩౯ |
| మిథునము | ౫-౩౧ | తుల | ౫-౨౪ | కుంభము | ౪-౮ |
| కర్కాటకము | ౫-౩౧ | వృశ్చికము | ౫-౩౫ | మీనము | ౪-౧ |

## మేషాదిసాయనరాశిప్రమాణములు

(నిరక్షరదేశమునకు)

| | | | |
|---|---|---|---|
| మీనమేషములు | ౪-౩౯ | కర్కాట ధనుస్సులు | ౫-౨౨ |
| వృషభకుంభములు | ౪-౫౯ | సింహవృశ్చికములు | ౪-౫౯ |
| మిథునమకరములు | ౫-౨౨ | కన్యాతులలు | ౪-౩౯ |

## ఇవి దశమ లగ్నాయనమున కావశ్యకములు

| | ° | ' | " |
|---|---|---|---|
| అయనాంశములు | భా ౨౩ | లి ౧౧ | విలి ౨౦ |
| అయనాంశగతి | | ' " | విలి ౫౦-౨ |

## సంవత్సర ఫలము

మి వృ మే మీ

| | | | |
|---|---|---|---|
| | | కు గు శు | ర చం బు |
| కే | జగల్లగ్నము | | |
| ల | | | రా |
| | శ | | |

మి వృ మే మీ

| | | | |
|---|---|---|---|
| | గు | ర శు | చం బు కు |
| కే | వర్షలగ్నము | | |
| ల | | | రా |
| | శ | | |

జగల్లగ్న వర్షలగ్న చక్రములు రెండిటియందును లగ్నము సింహమే అయినది. చతుర్థ స్థానాధిపతియైన కుజుడు భాగ్యమందు స్వక్షేత్రగతుడై యుండుటచేత జగల్లగ్నమునుబట్టి కుజునకు శుభసంబంధ ముండుటచేతను వర్షలగ్నమునుబట్టి కుజుడు రవితో గలసినను రవి లగ్నాధిపతి యగుటచేతను వ్యవసాయము మొదలగు పరిశ్రమలు లాభదాయకములై సుఖకరము లగును. కాని జగల్లగ్నమునుబట్టి లగ్నాధిపతి యష్టమమున నుండుటచే ప్రపంచసౌఖ్యము కొంచెమల్పమైనను శుభసంబంధాధిక్యముచే మిశ్రమముగ నుండును. రాజ్యాధిపతి వర్షలగ్నమునుబట్టి అష్టమమందు వ్యయాధిపతితో గలసియు, జగల్లగ్నమునుబట్టి షష్ఠాధిప శనివీక్షణము గల్గియుండుటచే రాజ్య సంబంధమైన వివాదములు గలుగుచున్నను జగల్లగ్నమునుబట్టి కుజగురు సంబంధముచేతను వర్షలగ్నమునుబట్టి బుధ సంబంధముండి రాజ్యమున సుగుస్థితిచేతను తృతీయమున రెండు చక్రములందును ఉచ్చశని సంబంధముచేతను ధైర్యసాహసముల చేతను నీతిచేతను వివాదములు పరిహరింపబడి సత్పరిపాలనము గలిగి రాజకీయముగు అభివృద్ధి విశేషములు గలుగును. షష్ఠవ్యయములందు రాహుకేతు సంబంధముచే వ్యయ మల్పమై లాభాధిక్యము గలిగియుండును. వర్షలగ్నమునుబట్టి ధర్మస్థానమున ఆధిపత్య శుభులైనను నైసర్గిక పాపులగు రవికుజు లుండుటచేతను జగల్లగ్నమునుబట్టి గురుశుక్రు లున్నను కుజ సంబంధముచేతను రెండిటియందును శని వీక్షణముచేతను వైదికధర్మము లుప్తప్రాయమైనను కొంచెము అభివృద్ధి ప్రయత్నములు జరుగుచుండును.

రెండుచక్రముల బట్టియు అగ్రిమపూర్ణిమా ప్రవేశలగ్నమును బట్టియు విచారింప ధాన్యము గోధుములు పత్తి పప్పుపదార్థములును కొంచెము ధరగలిగియున్నను సులభముగ దొరకుననియును, శర్కర బెల్లము చింతపండు మొదలగు మధురవస్తువులు దుర్లభము లగుననియును తోచుచున్నది. కాని ఆయా మాసములందైన గ్రహస్థితినిబట్టియు వేర్వేరుగ పదార్థముల ధరలు మరియొకచోట వ్రాయబడినవి.

ఈ సంవత్సరమున కొంతవరకు మొదట నచటచట ఖండఖండములుగ మంచి వర్షములు గురిసినను శ్రావణ భాద్రపదములలో అంతటను అనుకూలములగు వర్షములు గలుగవచ్చును. భాద్రపదాశ్వయుజములలో అపుడపుడు వాయుయోగములు గానవచ్చుచున్నవి. సర్వసస్య సముదాయమగు ౧౭ వీసములలో ౧౧ వీసముల పంట ఫలించును.

సర్వేషాం సమస్త శుభాని భవన్తు.

## చంద్రగ్రహణము

తా 26 జూలై 1953 సం.

విజయ సంవత్సరే ఆషాఢ శు ౧౫ ఆ. రే ముచ్యమానోదయ ఖచ్ఛన్న చంద్రగ్రహణమ్. రాహుగ్రస్తః. పింగళవర్ణః సూర్యోదయాదితః.

స్పర్శకాలః ౨౫-౪౩ ప గం 8-59
నిమీలనకాలః ౨౭-౧౦ ప గం 4-58
మధ్యకాలః ౩౦-౧౬ ప గం 5-48
సూర్యాస్తమయాదితః
ఉన్మీలనకాలః ౦-౭ సా గం 6-39
శుద్ధమోక్షకాలః ౨-౩౪ సా గం 7-38

ఆద్యంత పుణ్యకాలః ౯-౫ గం 8..38 బింబాదర్శనకాలః ౪-౧౨ గం 1-41

ఉత్తరగోలః సవ్యగ్రహణం ఈశాన్య దిక్స్పర్శః. నైరృతి నిమీలనం. ఈశాన్యోన్మీలనం. నైరృతిదిఙ్మోక్షః.

## నిత్యభోజన ప్రత్యాబ్దికాది నిర్ణయము

"గ్రస్తోదయే విధోః పూర్వం నాహర్భోజన మాచరేత్." అను ధర్మశాస్త్రవచనముచే నీ గ్రహణము గ్రస్తోదయముగావున నీనాడు, పగలు భుజింపరాదు. రాత్రియందైనను శుద్ధ మోక్షానంతరము స్నానముచేసి భోజనము చేయవలెను. ప్రత్యాబ్దికాదికమున్న— "గ్రస్తోదయే భవేదిందోర్దివా శ్రాద్ధం నకారయేత్। రాత్రావపి తదా కుర్యాత్ప్రత్యబ్దం మనురబ్రవీత్ ॥" అను ప్రమాణముచే శుద్ధ మోక్షానంతరమే చేయదగినది.

## చంద్రగ్రహణము

ది 18 జనవరి 1954 సం.

విజయ సంవత్సర పౌష శు ౧౪ సో. శే గ్రస్తాస్తమయ ఖచ్ఛన్న చంద్రగ్రహణమ్। కేతుగ్రస్తః పింగళవర్ణః సూర్యాస్తమయాదితః.

స్పర్శకాలః ౩౧-౨౧ తె గం 6-22
పరదినే సూర్యోదయాదితః
నిమీలనకాలః ౨-౫౭ ఉ గం 7-49
మధ్యకాలః ౩-౩౬ ప గం 8-4
ఉన్మీలనకాలః ౪-౧౬ ప గం 8-20
శుద్ధమోక్షకాలః ౭-౫౪ ప గం 9-48

ఆద్యంత పుణ్యకాలః ౭-౩౪ గం 8-36 బింబాదర్శనకాలః ౧-౧౯ గం 0-32 దక్షిణ గోలః. అపసవ్యగ్రహణం ప్రాగ్దిక్స్పర్శః నైరృత్యాం నిమీలనం దక్షిణ నైరృతి మధ్యే ఉన్మీలనం. వాయుదిశి మోక్షః.

## నిత్యభోజన ప్రత్యాబ్దికాది నిర్ణయము.

ఈ గ్రహణము గ్రస్తాస్తమగుటచే శు ౧౫ మం. న రాత్రి చంద్రోదయానంతరము స్నానముచేసి భుజింపవలెను. ఇందుకు ప్రమాణము. "గ్రస్తావేవాస్తమానంతు రవీందూ ప్రాప్నుతో యది। తయోః పరేద్యు రుదయే స్నాత్వాభ్యవహరేన్నరః ॥" అని కలదు. సూర్యచంద్రులు గ్రస్తులై యస్తమించినచో పరదినమున సూర్యగ్రహణమున సూర్యోదయానంతరము చంద్రగ్రహణమున చంద్రోదయానంతరమున్ను స్నానముచేసి భుజింపవలయును. పరదినమున జరుపవలసిన ప్రత్యాబ్దికము కలిగినచో గణితశాస్త్రముచే నిందు వ్రాయబడిన శుద్ధమోక్షానంతరము ప్రత్యాబ్దిక మాచరింపవలయును. ప్రమాణము :— "గ్రస్తేచంద్రేస్తం గతేచే త్తదహ్ని కుర్యాత్ప్రత్యబ్దం యథాకాలమేవ" అని కలదు.

## ధర్మశాస్త్ర విశేషయములు

### వైష్ణవ శ్రీరామనవమి (పూర్వపద్ధతి పంచాంగే)

చైత్ర శు ౭ సో ౦-౨౭ ఆర్ద్ర ౨౪-౬ స్మార్తమాధ్వ శ్రీరామ ౯ మి॥ శు ౯ మం ౨-౧ పున ౨౬-౩౪ శ్రీవైష్ణవ శ్రీరామ ౯ మి. నిబంధన గ్రంథములందు నవమి త్రిముహూర్త పరిమితి గలిగియున్నచో దశమి పారణయోగ్యమైనపుడు నవమినాడు శ్రీరామనవమి యగునని కలదు. ప్రస్తుతము నవమి త్రిముహూర్తాల్పమగుటచే స్మార్తులకును వైష్ణవులకును గూడ అష్టమీశేషముగల సోమవారముననే శ్రీరామనవమి యగును. రామానుజ సంప్రదాయమువారికి అష్టమీశేషము నిషిద్ధమగుటచేతను స్వల్పనవమియైనను గ్రాహ్యమగుటచేతను పరదినమున శేషనవమినాడే శ్రీరామనవమి.

సరస్వత్యుద్వాసనము (పూర్వపద్ధతి పంచాంగంలో)

ఆశ్వయుజ శు ౭ శు ౭-౫౪ ఉషా ౩౧-౨౪ దినం ౨౯-౯ సరస్వత్యుద్వాసనం॥

శ్రవణ ప్రథమపాదమున సరస్వత్యుద్వాసనము చేయవలయును. శ్రవణ ప్రథమపాదము రాత్రియందు వచ్చినను ఆనాడే ఉద్వాసనము చేయవలయుననియు, రాత్రిభాగమనగా సూర్యాస్తాది త్రిముహూర్త కాలమనియు ధర్మశాస్త్రమునందు కలదు. గావున పూర్వపద్ధతి పంచాంగప్రకారము ఈనాడే సరస్వత్యుద్వాసనము చేయదగినది. దృక్పంచాంగమున సందేహము లేదు.

మహోదయము.

పౌష బ ౩౦ బు ౩౬-౫౪ శ్రవ ౪౬-౧౭ సిద్ధి ౧-౫౭ వ్యతి ౫౨-౨౫ చతు ౯-౨౭ మహోదయాలభ్యయోగ పుణ్యకాలము.

అమావాస్య, శ్రవణము, వ్యతీపాత, ఆదివారము కలిసినచో అర్ధోదయయోగము. ఇందు వారము మరియొకటైనచో మహోదయయోగము అగును. గాని ఆదివారముగాక సోమవారమే యైనచో మహోదయమని కొన్ని గ్రంథములందు కలదు. వైద్యనాథ దీక్షితీయమున బుధవారమైనచో మహోదయమని కలదు. గావున ప్రస్తుతము బుధవారమైనదిగాన సిద్ధియోగానంతరము మహోదయముగాదగియున్నది. గాని—"దర్శస్యాంతః పూర్వభాగశ్చ పాతే శ్రోణామధ్యం భాస్కరస్యోదయశ్చ। భానోర్వారేత్వేవ చార్ధోదయస్స్యాత్ సైవ వారేతన్మహత్పూర్వమాహుః" అను శ్లోకముచే చతుష్పాత్ప్రకరణము గతించిన పిమ్మట దర్శోత్తరార్ధ, శ్రవణమధ్య పాతపూర్వభాగములు కలియునుగావున అప్పటినుండియు మహోదయయోగము. ఈ యోగము సంగవకాలము దాటినచో ముఖ్యకాలముగాదు. కావున ఘ ౯-౨౭ లగాయతు ఘ ౧౧-౨౨ వరకు పుణ్యకాలమని గ్రహించెదరుగాక.

## శ్రీ విజయనామసంవత్సర పఞ్చాఙ్గ పీఠికా.

అచింత్యావ్యక్త రూపాయ నిర్గుణాయ గుణాత్మనే। సమస్త జగదాధారమూర్తయే బ్రహ్మణేనమః ॥౧॥ లంబోదరాంఘ్రి ద్వయమంబుజశ్రీ సర్వస్వహార్యన్వహ మర్చయామః। యదర్చయా బ్రహ్మముఖామరేశా నిరంతరాయం సఫలీకృతార్థాః ॥౨॥ ప్రావృట్పయోధనిభా భుజంగశయ్యా విభూషా విహగోత్తువాహా। గోపాలమల్లేశ్వర దేవదేవౌ భజే ప్రియాదత్త హృదర్ధదేహా॥3॥ వేదమయీం నాదమయీం బిందుమయీం పరపదోద్య దిందుమయీం। మంత్రమయీం తంత్రమయీం ప్రకృతిమయీంనౌమి విశ్వవికృతిమయీం॥౪॥

గురుస్తుతిః ॥ శ్రీ నోరివంశాబ్ధిసోమం సూర్యనారాయణం బుధం। జ్యోతిశ్శాస్త్రి కులగురుం ధ్యాయామి మనసానిశం ॥౫॥ యదనుగ్రహతః ప్రాప్తం విజ్ఞానం సర్వశాస్త్రజం। తం సాహిత్యగురుం వందే దర్భా వైరాగి శాస్త్రిణం ॥౬॥ చిలుకూరి ఖ్యాతవంశమణిం కొండయ్య శాస్త్రిణం। శబ్దశాస్త్రి నిష్ణాతం వందే మచ్ఛాబ్దదేశికం ॥౭॥ మాతులం న్యాయసాహిత్యాచార్యం మన్న్యాయదేశికం। భజామ్యహం వారణాశి వేంకటేశ్వర శాస్త్రిణం ॥౮॥ యస్య బోధలవం ప్రాప్య మీమాంసా శాస్త్రసాగరః। తీర్ణోమయా గురుం వందే భూమానందయతీశ్వరం ॥౯॥ మహామహోపాధ్యాయం శ్రీయూపాఖ్యమురళీధరం। తంనౌమ్యస్మద్గురుం జ్యోతిశాబ్ధిపారంగతోయతః॥

స్వీయవంశక్రమః॥ శ్రీ కౌండిన్యసగోత్రే పిడపర్త్యాఖ్యాన్వయే ప్రసిద్ధతమే । త్రిస్కంధ శాస్త్రకృతినో భవన్తి శశ్వద్బహవః కాలాత్ ॥౧౧॥ చలమాఖ్య వేంకటచలాఖ్యాఖ్య స్తత్ర భవద్విబుధః । యోలుప్తమాసవిషయక వాదేనాగణయదపిచ విశ్వపతిం ॥౧౨॥ తస్య సుత స్తత్సదృశశ్శేషాచల దైవవిత్ప్రవరః । జజ్ఞాతే తస్యసుతౌ పూర్ణౌ విద్యాసుపరిపూర్ణౌ ॥౧౩॥ తయోర్ద్వితీయో ఽద్వితీయ ప్రతిభావాన్బుధోత్తమః । శ్రీ పూర్ణార్యః పుష్కరాది సంస్కృత్వా ప్రోజ్వలద్యశాః ॥౧౪॥ తదనుగ్రహాత్త విద్యాః పంచసుతా స్తస్య శంభువక్త్రసమాః । శ్రీకృష్ణమూర్తి శాస్త్రివ్యాహ్వయ స్తృతీయోహ మేషు మయా ॥౧౫॥ గురువరకరుణావశతస్సిద్ధాంతీకృత్యనిఖిల సంసత్సు । స్వమతం తథాద్యక్రియతే పంచాంగం ధర్మకర్మార్హం ॥౧౬॥

## సంవత్సరాదికృత్యం.

అభ్యాదౌ మిత్రసంయుక్తో మంగళస్నాన పూర్వకం । అలంకృతో గణాధ్యక్షం వాణీం దైవవిదం గ్రహాన్ ॥ ౭॥ గురూన్విప్రాంశ్చ సంపూజ్య ముదితో బ్రాహ్మజన్మతః । సంవత్సరఫలం శ్రుత్వా సుకృతానాం ఫలం లభేత్ ॥ ౮॥ యద్వర్షాదౌ నింబసుమం శర్కరామ్ల ఘృతైర్యుతం । భక్షితం పూర్వ యామే స్యాత్తద్వర్షం సౌఖ్యదాయకం॥ ౯॥

## బ్రహ్మణః ప్రమాణాదికం.

బ్రహ్మణస్సౌరమానేన త్రుటికాల ప్రమాణం మా ౫ ది ౨౭ ఘ ౪౬ విఘ ౪౦. లవకాలప్ర. సం ౪౯ మా ౪ ది ౧౭ ఘ ౪౬ విఘ ౪౦. నిమేషకాల ప్ర. సం. ౧౪౮౧ మా ౫ ది ౨౩ ఘ ౨౦ గుర్వక్షరోచ్చారణకాల ప్ర. సం. ౪౦ సహస్రాణి. ప్రాణకాల ప్ర॥ సం ౪ లక్షాః. విఘటీప్ర. సం. ౨౪ ల. ఘటీప్ర. సం ౧౪ కో ౪౦ ల. దినప్ర సం ౪౩౨ కోటయః. అనేన బ్రహ్మణః ప్రమాణసౌరాబ్దాః ౩,౧౧,౧౪,౦౦౦ కోటయః. వర్తమానస్యాస్య బ్రహ్మణః పరాఖ్యస్యాయుషోర్ధంగతం॥ ద్వితీయ పరార్ధే ప్రథమ వర్షే ప్రథమవాసరే గతఘట్యాదయః ఘ ౧౩ విఘ ౪౨ ప్రా (౦) గుర్వ ౩ నిమే ౧౯ లవ ౧౭ త్రుటయః ౩౪. సంప్రతి పంచత్రింశత్తమే త్రుటికాలే గతసౌరమానాదయః. మా ౨ ది ౨ ఘ ౧౩ విఘ ౨౦. బ్రహ్మణస్సౌరమానేన వయోగతవత్సరాః ౧, ౫౫, ౫౨, ౧౯౭ కో ౨౯ లక్ష౯ సహ ౫౪ సం. ఇదానీంతనశ్వేతవరాహకల్పేస్వాయంభువాద్యాష్షణ్మనవోగతాః। సప్తమే వైవస్వతమన్వంతరే సప్తవింశతి మహాయుగా గతాః। సప్తర్షీంద్ర మనూనామపి స్వకాలేనాయుర్వర్షశతమేవ । తచ్చైకసప్తతి ౭౧ మహాయుగమితం తత్ప్రమాణ సౌరాబ్దాః ౩౦ కో ౬౭ ల ౨౦ సహ॥ తత్సంవత్సరప్ర ౨ ల ౫౫ సహ ౬౦౦ సం॥ అహోరాత్రప్ర. ౮౫౨౦ సం. అహఃప్ర ౪౨౬౦ సం। ఘటీప్రసం. ౧౪౨. వర్తమాన స్యాస్య వైవస్వత మనోర్వయోగతవత్సరాః । ౧౨ కో ౫ ల ౩౩ సహ ౫౪ సం॥ ఏష్యాబ్దాః ౧౮ కో ౬౧ ల ౮౬ సహ ౯౪౬ సం। శ్రీ మజ్జగద్గురు శ్రీమచ్ఛంకర భగవత్పాద పూజ్యవతారాబ్దాః ౨౦౨౫ శ్రీ శాలివాహనశకగతాబ్దాః ౧౮౭౫ ప్రభవాది గతాబ్దాః ౨౬ ఏష్యాబ్దాః ౩౪.

## వ్యవహారమాన నిరూపణం

అథాస్మిన్దేశే లోకవ్యవహారార్థం చాంద్రమానాబ్దో గ్రాహ్యః। వింధ్యస్యోత్తరదేశే బార్హస్పత్యమానాబ్దో గ్రాహ్యః। అయమేవ ఫలప్రదర్శనార్థం మాసనామ్నా గ్రాహ్యః। చాంద్రమానవశాదయం విజయనామ సంవత్సరః। బార్హస్పత్యమానవశాదయం పరాభవనామ సంవత్సరః। అయమేవ మార్గశీర్షాబ్ద ఇత్యుచ్యతే। ప్రభవాదిత్రయాంశేషు షష్టి సంవత్సరేషు వర్తమానానాం ద్వాదశయుగానాం మధ్యే అహిర్బుధ్న్య దేవతాకం షష్ఠయుగం వర్తమానం। తత్ర సూర్య దేవతాకః పరివత్సర సంవత్సరః। అస్మిన్యవదానం మహాఫలం॥ పరివత్సరఫలం। ప్రముఖే ద్వితీయే। (ప్రముఖే ఆదౌ వృష్టిః) కాంతి మత్రియుగఆదిత్రప్రయం। ఇతి। బార్హస్పత్యమానేన ఇద్వత్సరఫలం। చ్యుల్పోదకం పంచమ ముబ్దముక్తం॥ ఇతి।

తా॥ ఈ దేశమున చాంద్రమానముచే విజయసంవత్సరము. దీనికి పరివత్సరమనియు పేరు. ఇందు యవదానము మహాఫలము. బార్హస్పత్యమానముచే పరాభవసంవత్సరము. ఇది మార్గశీర్షాబ్దమనియు చెప్పబడును. ఇందుపు మొదట అనుకూలవర్షములు గలుగును. బార్హస్పత్యమానముచే మొత్తముమీద వర్షములు తక్కువయగును.

## విజయసంవత్సర ఫలం

నశ్యతే వారి ధారాభిః పూర్వసస్యాఖిలంఫలం। రాజభిశ్చాపరంసస్యం విజయా జ్జేజయేచ్ఛుభిః॥ బార్హస్పత్య మానాబ్ద ఫలం॥ పరాభవాబ్దే రాజానః ప్రాప్నువంతి పరాభవం। ఆమయాః క్షుద్రధాన్యాని ప్రభూతాని సువృష్టయః॥ మార్గశీర్షాబ్దఫలం॥ సౌమ్యాఖ్యవర్షే శలభాండజాఖుమృగాదిభిశ్చాఖిల సస్యహానిః। అత్యల్పవృష్టిర్బహు రోగపీడా భవంతి భూపాః కలహోత్సుకాస్స్యుః॥

తా॥ విజయసంవత్సరమున పూర్వసస్యఫలము వర్షములచే హానిచెందును. జయకాంక్షులగువారి యుద్ధములచే రెండవపంట హానిచెందును. బార్హస్పత్యమానముచే పరాభవగాన ప్రభువులు పరాభవము నందుదురు. రోగములు క్షుద్రధాన్యములు వర్షములు వృద్ధిగ నుండును. మార్గశీర్షాబ్దమగుటచే సస్యములకు పీడచేయు మిడతలు పక్షులు ఎలుకలు మృగములు వృద్ధియగును. వర్షములు తక్కువయగును. వ్యాధులు హెచ్చగును. ప్రభువులు యుద్ధోత్సుకులయ్యెదరు.

## రాజాదినిర్ణయము

| | | |
|---|---|---|
| రాజా చంద్రః | ధాన్యాధిపతిః కుజః | నీరసాధిపతిర్గురుః |
| మంత్రీ చంద్రః | అర్ఘాధిపతిస్సూర్యః | పురోహితో గురుః |
| సేనాధిపతిస్సూర్యః | మేఘాధిపతి స్సూర్యః | పరీక్షకో బుధః |
| సస్యాధిపతిర్గురుః | రసాధిపతిశ్శనిః | గణకశ్శుక్రః |
| గ్రామపాలకశ్చంద్రః | దేవాధిపతిర్గురుః | జంగమాధిపతిర్గురుః |
| దైవజ్ఞస్సూర్యః | నరాణామధిపతి స్సూర్యః | సర్పాధిపతిశ్శుక్రః |
| రాష్ట్రాధిపతి శ్చంద్రః | గ్రామనాయకో బుధః | మృగాధిపతి స్సూర్యః |
| అశ్వాధిపతిశ్చంద్రః | వస్త్రాణామధిపతి శ్శనిః | శుభాధిపతిశ్చంద్రః |
| గజాధిపతిర్గురుః | రత్నాధిపతిశ్చంద్రః | స్త్రీణామధిపతి స్సూర్యః |
| పశూనామధిపతి స్సూర్యః | వృక్షాధిపతిః కుజః | |

చంద్రుడు—రాజు, మంత్రియు నయ్యెను. మరియు గ్రామపాలకుడు, రాష్ట్రాధిపతి, అశ్వాధిపతి, రత్నాధిపతి, శుభాధిపతియు నయ్యెను.

సూర్యుడు—సేనాధిపతియు, అర్ఘాధిపతియు, మేఘాధిపతియు నయ్యెను. మరియు దైవజ్ఞుడు, పశ్వధిపతి, మనుష్యాధిపతి, మృగాధిపతి, స్త్రీలకధిపతియు నయ్యెను.

గురుడు—సస్యాధిపతి నీరసాధిపతియు నయ్యెను. పురోహితుడు, గజాధిపతి, దేవాధిపతి, జంగమాధిపతియు నయ్యెను.

కుజుడు—ధాన్యాధిపతి—వృక్షాధిపతియు నయ్యెను.

శని—రసాధిపతియు, వస్త్రాధిపతియు నయ్యెను.

బుధుడు—పరీక్షకుడును, గ్రామనాయకుడు నయ్యెను.

శుక్రుడు—గణకుడు, సర్పాధిపతియు నయ్యెను.

## రాజు చంద్రుడు, ఫలము

గోధూమశాలీక్షుమతీ ధరిత్రీ పుష్పైర్విచిత్రా ఒధ్వర వేదనాదైః। విభాన్తి గావః పయసా ప్రభూతా దుగ్ధాబ్ధిజే వర్షపతౌ చ సోమే॥

తా॥ చంద్రుడు రాజగుటచే భూమియందు గోధుమలు ధాన్యము చెరుకుతోటలు సమృద్ధియగును. పుష్ప ఫలాదులు, యజ్ఞాది సత్కార్యములును వృద్ధియగును. గోవులు క్షీరసమృద్ధి గలవి యగును.

## మంత్రి చంద్రుడు, ఫలము.

తుహినకరే సచివవరే నానావిధ సస్యసంపూర్ణా। ద్విజసజ్జన పశువృద్ధిః కానన ఫలపుష్పజంతుతోయర్ద్ధిః॥

తా॥ చంద్రుడు మంత్రి యగుటచే బహువిధములగు సస్యములును సమృద్ధియగును. ద్విజులు సజ్జనులు పశువులు తోటలు పుష్ప ఫలాదులు ఇతర జంతువులు జలము సమృద్ధి యగును.

రాజును మంత్రియు చంద్రుడే యగుటకు ఫలము :—స్వయం రాజా స్వయం మంత్రీ వత్సరేషు భవేద్యది। చోరాగ్ని శస్త్రబాధాభిః పీడ్యన్తే భూభుగాదయః॥ తా॥ రాజును మంత్రియు నొకడే యైనచో ప్రభువులు మొదలు ప్రజలందరును చోరులవలన అగ్ని వలన శస్త్రములవలనను బాధల నందుదురు.

## సేనాధిపతి సూర్యుడు, ఫలము.

అన్యోన్య యుద్ధం ధరణీశ్వరాణాముల్పాంబుదా వారిధరాస్సమంతాత్। రక్తాని సస్యానిఫలన్తి భూమౌ సైన్యాధిపత్యే దివసేశ్వరస్య॥

తా॥ సూర్యుని సైన్యాధిపత్యమందు ప్రభువులకు పరస్పర యుద్ధయత్నములు, మేఘములంతటను స్వల్పోదకము నిచ్చునవి యగును. ఎరుపు సస్యములు ఫలించును.

## సస్యాధిపతి గురుడు ఫలము.

యవగోధూమచణకాః ఫలితాస్స్యుర్బృహస్పతౌ।
పీతధాత్రీ సుఫలితా గురౌ సస్యాధిపే సతి॥

తా॥ గురుడు సస్యాధిపతి యగుచో యవలు గోధుమలు శనగలు ఫలించును. పచ్చనిభూమి బాగుగ ఫలించును.

## ధాన్యాధిపతి కుజుడు, ఫలము.

సీదంతి సస్యనిచయా భువి భౌమే ధాన్యపే మహోష్ణ వశాత్।
అపరాఖిల ధాన్యచయం క్వచిత్క్వచిద్భవతి శస్త్రభయం॥

తా॥ కుజుడు ధాన్యాధిపతియగుచో ఉడుకువలన సస్యసముదాయములు పీడనందును. ఒక్కొకచో రెండవ పంటలన్నియు పండును. ఒక్కొకచో యుద్ధభయము గలుగును.

## అర్ఘాధిపతి సూర్యుడు, ఫలము.

అవర్షశ్చాల్పవృష్టిశ్చ ప్రజానాంక్షుద్భయంతథా।
రాజ్ఞాం పరస్పరక్రోధ స్సూర్యేర్ఘాధిపతౌయది॥

తా॥ అర్ఘాధిపతి సూర్యుడగుటచే వర్షములు తక్కువ, ధరలు హెచ్చుగును. ప్రజలకు దుర్భిక్షముచే నాకటిభయము. పాలకులకు పరస్పర కలహములు గల్గును.

## మేఘాధిపతి సూర్యుడు, ఫలము.

మహద్భయం ఫలం స్వల్పం వర్షం స్యాత్ఖండశోభువి।
రక్తసస్యం సుఫలితం సూర్యే మేఘాధిపే సతి॥

తా॥ సూర్యుడు మేఘాధిపతియగుటచే ప్రజలకు భయము అధికమగును. భూమియందు ఖండఖండములుగు స్వల్పవర్షములు గల్గును. ఎర్రధాన్యము ఫలించును.

## రసాధిపతి శని, ఫలము.

తిలమాషకులుత్థాది కృష్ణధాన్యాని యానిచ।
సులభాని రసాధీశే శనౌ వాన్యద్గుడాదికం॥

తా॥ శని రసాధిపతియగుచో నూవులు మినుములు ఉలవలు మొదలగు నల్లధాన్యములు ఫలించును. శర్కర గుడము మొదలగునవి దుర్లభములగును.

## నీరసాధిపతి గురుడు, ఫలము.

పూగీఫలాన్యఖిలరత్న సువర్ణధాన్య కార్పాసచర్మ కుసుమానిచ చందనం చ। వృద్ధింయయు ర్ద్విజగణాస్సుఖినోభవన్తి భూమౌ చ నీరసపతౌ సురరాజపూజ్యే॥

తా॥ నీరసాధిపతి గురుడగుటచే పోకలు రత్నములు సువర్ణము ధాన్యములు ప్రత్తి చర్మములు చందనము పుష్పములు మొదలగు నీరసవస్తువులు వృద్ధియగును. ద్విజులకు సుఖము గలుగును.

## పురోహితాద్యధిపతి, ఫలము.

క్రూరగ్రహ ఫలం క్రూరం శుభగ్రహఫలం శుభం।
పురోహితాద సర్వేషాం భవేదీశ సముద్భవం॥

తా॥ నవనాయకులకంటె తక్కువ పురోహితుడు మొదలగు అధిపతులు క్రూరులగుచో చెడుఫలము. శుభులగుచో మంచిఫలము. (రవికుజశనులు క్రూరులు. చంద్ర బుధ గురు శుక్రులు శుభులు)

## మేఘాది నిర్ణయము, ఫలము.

నీలనామక మేఘము— సువృష్టి । ఆగ్నేయదిగ్భాగమున మేఘోత్పత్తి । చతుర్మేఘపక్షమున పుష్కలమేఘము—దక్షిణపు వానలు । సంవహవాయువు—అల్పవృష్టి । చంచలయను పెంపు—సుభిక్షము । నిర్దోషమను ఉరుము—అల్పవృష్టి । క్షీరోదధిసముద్రము—అత్యల్పవృష్టి । శంఖుడు భూమిని వహించును—ప్రజలకు సుఖము గలుగును.

జ్యేష్ఠ బ ౧౩ సో (29-6-1953) సావన వర్షారంభము
వర్షాధిపతౌ చంద్రే వర్షవివృద్ధిస్తు సర్వసస్యానాం।
నీతియుతాః పృథ్వీశాః పరస్పరం ప్రీతి సంయుతోమనుజాః॥

తా॥ చంద్రుడు సావనవర్షాధిపతియగుటచే సర్వసస్యములకు అనుకూలములగు వర్షములు. పాలకులు నీతిచే పాలింతురు. ప్రజలు పరస్పరస్నేహముతో నుందురు.

## వర్ష పరిమాణము

ఆఢకత్రయ మితమగువర్షము—సుభిక్షమగును। "సప్తభాగాస్సముద్రేషు పర్వతేషు తథాదశ। చతుర్భాగాదరణ్యాంస్యు రేవం వర్షతి చ త్రిధా॥" సముద్రములందు ౩ భాగములును, పర్వతములందు ౧౦ భాగములును, భూమియందు ౪ భాగములును వర్షించును.

ఆఢకప్రమాణము—షష్టియోజన విస్తీర్ణం శతయోజనమున్నతం। ఆఢకస్య ప్రమాణం తు దేవమానేన గణ్యతే॥

ఆఢకస్థితి—సంవత్సరాది మొ. అధికవైశాఖ శు ౧౧కు. వ॥ గోపబాలుని చేతియందును, పిమ్మట శ్రావణ శు ౧౧ శు. వ॥ వృద్ధ బ్రాహ్మణుని చేతియందును, అటనుండి కార్తిక శు ౧౨ బు. వ॥ గోపబాలుని చేతియందును, తరువాత సంవత్సరాంత వ॥ గోప యువకుని హస్తమందును ఆఢకముండును. ఫలము—ఆఢకము బ్రాహ్మణహస్తమందున్నచో దుర్భిక్షము సస్యహాని। గోపహస్తమందున్నచో సుభిక్షము ఆరోగ్యము సంపత్తు గలుగును. వయస్సు బాల్యమగుచో ననావృష్టి, యౌవనమగుచో సువృష్టి। వార్ధక్యమగుచో సుభిక్షము నగును.

## పశుపాలకాది నిర్ణయము, ఫలము.

పశుపాలకుడు శ్రీకృష్ణుడు. గోష్ఠప్రాపకుడును గోష్ఠబహిష్కర్తయును యముడు నయ్యెను. శ్రీకృష్ణుడు పశుపాలకుడగు

టచే పశువృద్ధి, సస్యవృద్ధి, సుభిక్షము, పశువులకు తృణక్షీరాద్యభి వృద్ధియు కలిగి ధరలనుకూలముగ నుండును. తక్కిన యాధిపత్యములు యమునకగుటచే అల్పవృష్టి, దుర్భిక్షము, తృణాదిహాని కించిత్తుగ పశుపీడయు గలుగుచుండును.

## వర్షధాన్యాది ప్రమాణములు

వర్షం ౧౩ ధాన్యం ౮ శీతం ౧౧ తృణం ౧౯ ఉష్ణం ౧౩ మారుతః ౨ ప్రజా వృ ౧౮ హా ౧౫ రాజ విగ్రహం ౧౧ వ్యాధయః ౧౫ ఉపశమనం ౧౯ ఆచారః ౧౩ అనాచారః ౧౯ మరణాని ౨ జన్మాని ౧౫ దేశోపప్లవః ౧౩ దేశస్వాస్థ్యం ౭౧ చోరభయం ౮ హా ౮ మృగోపద్రవః ౧౫ హా ౯ కీటభయం ౯ హా ౧౮ మూషక వృ ౧౮ హా ౯ సర్పవృ ౧౧ హా ౮ గోమాయు వృ ౧౧ హా ౫ కీట వృ ౫ హా ౫ శలభవృ ౩ హా ౧౧ మశకవృ ౨ హా ౮ మత్కుణ వృ ౧౧ హా ౩ వృశ్చిక వృ౧౧హా ౧౧ వ్యాఘ్రవృ ౩ హా ౨ సస్య వృ ౯ హా ౨ శుకవృ ౮ హా ౮ పికవృ ౭ హా ౫ కుక్కుట వృ ౭ హా ౭ ఖగవృ ౭ హా ౩ గో వృ ౭ హా ౪ మహిషవృ ౭ హా ౬ మృగ వృ ౩ హా ౩ ఛాగ వృ ౫ హా ౫ అశ్వ వృ ౬ హా ౫ అండజ వృ ౧౩ హా ౮ స్వేదజవృ ౧౦ హా ౧౯ వ్రీహి వృ ౧౪ శాలి వృ ౧౪ కుళుత్థ వృ ౪ తిల వృ ౧౭ మాషవృ ౬ ముద్గ వృ ౧౭ సర్షప వృ ౧౦ చణక వృ ౧౬ అఢక వృ ౧౦ గోధూమ వృ ౧౭ కోద్రవవృ ౧౦ ప్రియంగు వృ ౧౬ యావనాళ వృ ౧౭ శ్యామాక వృ ౧౭ రాజమాష వృ ౪ నీవార వృ ౧౬ వేణుధాన్య వృ ౧౭

## రవి చార ఫలము

చైత్ర బ ౩౦ సో. మేషేర్కః ౭౪-౫౪॥ అమావాస్య—సస్యనాశము। సోమవారము—సుభిక్షము। కరణి—సువృష్టి। నైరృతి—అనావృష్టి, నాగవం—ధర పెరుగుట, సింహలగ్నము—అనావృష్టి, పూర్వాషాఢ నవకం—శుభము। పగలు—దుర్భిక్షము యుద్ధభయము, సాయంకాలము-శుభము.

ఈ సంవత్సరము సూర్యుడు సేనాధిపతియగుటచే స్వల్ప వృష్టి, అల్పమైన పంటలు, దుర్భిక్షము, ప్రభువులు యుద్ధాసక్తులయ్యెదరు.

ఆర్ద్రాప్రవేశము—జ్యేష్ఠ శు ౯ ఆ. కే (తత్కాలదశమి) ఆర్ద్రా ౧౪ర్కః ౩౩-౩౩ ఘటను. దశమి—శుభము, ఆదివారము—పశుహాని। గర—చిత్రధాన్యవృద్ధి। పరిఘ—దుర్భిక్షము, తైతిల—శుభము, సూర్యలగ్నము – సుభిక్షము। అస్తమయము—సుభిక్షము। అర్ధరాత్రము—సువృష్టి। మఘాదిమండలము—మధ్యవృష్టి.

## చంద్ర చార ఫలము

జ్యేష్ఠ శు ౧ శుక్రవారము। ప్రజలకారోగ్యము, సుభిక్షము, క్షేమము, సస్యవృద్ధి, సువృష్టి, ఆషాఢ శు ౫ గురువారము—సుభిక్షము, ఆరోగ్యము। ఆషాఢ శుక్లమున స్వాతినవమినాడయ్యెను. ఫలము—చల్లిన విత్తనములు ఎగిరిపోవునట్లు గాలి వీచుచుండును. ఆషాఢ బహుళమున రోహిణి దశమినాడయ్యెను. ఏకాదశియు గలదు. దశమి—సర్వసస్యసమృద్ధి। ఏకాదశి—మధ్యమము। చంద్రుడు రాజగుటచే మంచివర్షములు, సస్యవృద్ధి సుభిక్షము.

మరియు నధిక వైశాఖమున ౫ మంగళవారములు. జ్యేష్ఠమున ౫ శనివారములు. ఆషాఢమున ౫ ఆదివారములు. శ్రావణమున ౫ మంగళవారములు. కార్తికమున ౫ శనివారములు. ౫ ఆదివారములు. మార్గశిరమున ౫ మంగళవారములు. ఫాల్గునమున ౫ శనివారములు.

ఆదివారము లైదగుచో దుర్భిక్షము। మంగళవారము లైదగుచో యుద్ధభయము। శనివారము లైదగుచో—జననాశనము, దుర్భిక్షము, భూకంపము మొదలగు ఉపద్రవములు గలుగును.

## సౌరార్ఘ్యలు

మేషమిథున కర్కాటక తులా ధనుః కుంభమాసములందు యావనాళయాలకీ కుంకుమహింగు కాంస్యతైలైరండగోధూమ కస్తూర్యాదులు శూన్యార్ఘ్యములగును। ధాన్యాజ్యచణకవస్త్ర కర్పూర లవణతామ్ర కుళుత్థలవంగ పుష్పపీసాదు లత్యర్ఘ్యములగును। సువర్ణ రజతకార్పాసమాష ముద్గ మరిచ నాగవల్లీదళ తిలజీరజాజిపిప్పలి పట్టావికాయస శృంగన క్రముక శర్కరాదులు సమార్ఘ్యములగును.

వృషభమీనమాసములందు—యావనాళాదులు సమార్ఘ్యములు। ధాన్యాదులు శూన్యార్ఘ్యములు। సువర్ణాదు లత్యర్ఘ్యములు.

సింహకన్యావృశ్చిక మకర మాసములందు—యావనాళాదు లత్యర్ఘ్యములు। ధాన్యములు సమార్ఘ్యములు। సువర్ణాదులు శూన్యార్ఘ్యములు.

## చాంద్రార్ఘ్యలు

చైత్ర నిజ వైశాఖ భాద్రపద పౌష ఫాల్గునమాసములందు—యావనాళాదులు సమార్ఘ్యములు। ధాన్యాదులు శూన్యార్ఘ్యములు। సువర్ణాదు లత్యర్ఘ్యములు

అధికవైశాఖ ఆషాఢ శ్రావణ ఆశ్వయుజ కార్తిక మార్గశిర మాఘమాసములందు—యావనాళాదులు శూన్యార్ఘ్యములు। ధాన్యాదు లత్యర్ఘ్యములు। సువర్ణాదులు సమార్ఘ్యములు.

జ్యేష్ఠమాసమున - యావనాళాదులత్యర్ఘ్యములు. ధాన్యాదులు సమార్ఘ్యములు. సువర్ణాదులు శూన్యార్ఘ్యములు.

## మౌఢ్య నిర్ణయము

చైత్ర బ ౯ బు (8-4-1953) ప్ర॥ అధిక వైశాఖ శు ౭ బు (15-4-1953) ప॥ శుక్రమౌఢ్యము. అధికవైశాఖ బ ౧౪ మం (12-5-1953) ప్ర॥ నిజవైశాఖ బ ౧౭ సో. (8-6-1953) ప॥ గురుమౌఢ్యము, మార్గశిర బ ౯ మం (29-12-1953) ప్ర॥ మాఘ బ ౯ శు. ప॥ (27-2-1954) శుక్రమౌఢ్యము.

## మకరసంక్రాంతి పురుష లక్షణము

అష్టకర్ణో విశాలాక్షో లంబభ్రూ ర్దీర్ఘనాసికః। అష్టబాహు శ్చతుర్వక్త్రః స్సంక్రాంతి పురుషస్మృతః॥ శతయోజన మాన్నత్యం విస్తీర్ణం ద్వాదశ స్మృతం। ఏవంరూపం హి విజ్ఞేయం సంక్రాంతి పురుషాకృతేః॥



ఈ మకర సంక్రాంతి పురుషునకు మందాకి యని పేరు. బ్రాహ్మణులకరిష్టము। నింబోదకముచే స్నానము—పాలకులకు శుభము। యావకాక్షతల ధరించును - యావకనాశనము। నీలాంబరమును ధరించును - గొప్ప భయము। లాక్షారసము గంధము - యుద్ధభయము। జపాపుష్పము - యశోహాని। గోమేధికాభరణము - పశుహాని। సీసపాత్రలో పాలు త్రాగును - ఆరోగ్యము - పశుహాని। కేసు పండును - తినును - శుభము। వృషభవాహనము - పాలకులకు హాని। ధనుస్సు ఆయుధము—

యుద్ధము । బంగారు గోదుగు—సువర్ణ వాశనము । అస్త్రమును ధరించును, రోగభయము. ఆగ్నేయదిక్కునకు ప్రయాణము—ఆగ్నేయ దేశమున కరిష్టము । విస్మయ చేష్ట—ప్రజలకు వ్యాధి । నివిషుడును. సస్యవృద్ధి ।

పక్షఫలము :—శుక్లపక్షే యదా పౌషే మకరస్థో దివాకరః । ప్రజానాం వ్యాధిపీడాచ నృపాణాం సమరోభవేత్ ॥ తా॥ మకర సంక్రాంతి శుక్లపక్షమున నైనచో ప్రజలకు వ్యాధిపీడ, పాలకులకు యుద్ధములు గలుగును. తిథ్యాది ఫలములు :—పౌష శు ౯ బు. (తత్కాలదశమి) మకరార్కః ౫౧-౫౬ ఘటికలు—ప్రీతి గురువారము—సువృష్టి । ఉగ్రనక్షత్రము—శూద్రపీడ । వృశ్చికలగ్నము-యుద్ధభయము । ౨౬ వ ముహూర్తము - రాష్ట్రపీడ । అపర రాత్రము—నటులకు హాని. శ్రీః. సస్యవిచారము

సస్యజాతక రీతిచే విచారింప పూర్వాపర సస్యములన్నియు బాగుండునట్లు తోచెడిని. అందు పూర్వసస్యములకే విశేషము గాన్పించుచున్నది. వాయకులబట్టి చూచినను పూర్వసస్యాధిక్యమే తెలియుచున్నది. సర్వ సస్యసముదాయమును ౧౬ భాగములలో ౧౧ భాగముల పంట పండుననియును తెలియుచున్నది.

## ఆదాయవ్యయములు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషవృశ్చికయోః | ఆ | ౧౪ | వ్య | ౨ | సింహస్య | ఆ | ౮ | వ్య | ౨ |
| వృషభతులయోః | ఆ | ౮ | వ్య | ౧౧ | ధనుర్మీనయోః | ఆ | ౨ | వ్య | ౧౧ |
| మిథునకన్యయోః | ఆ | ౧౧ | వ్య | ౮ | మకరకుంభయోః | ఆ | ౫ | వ్య | ౫ |
| కర్కటకస్య | ఆ | ౫ | వ్య | ౮ | సర్వస్య | ఆ | ౫౩ | వ్య | ౪౭ |

## రాజపూజావమానములు

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషస్య | రా ౪ | అ | ౫ | సింహస్య | రా ౨ | అ | ౪ | ధనుషః | రా ౬ | అ | ౭ |
| వృషభస్య | రా ౭ | అ | ౫ | కన్యాయాః | రా ౫ | అ | ౪ | మకరస్య | రా ౩ | అ | ౩ |
| మిథునస్య | రా ౩ | అ | ౧ | తులాయాః | రా ౧ | అ | ౭ | కుంభస్య | రా ౬ | అ | ౩ |
| కర్కటకస్య | రా ౬ | అ | ౧ | వృశ్చికస్య | రా ౪ | అ | ౭ | మీనస్య | రా ౨ | అ | ౬ |

## కందాయఫలములు

| అశ్వి | భర | కృ | రోహి | మృగ | ఆర్ద్ర | పున | పుష్య | ఆశ్లే |
|---|---|---|---|---|---|---|---|---|
| ౫ | ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ |
| **మఘ** | **పూఫ** | **ఉఫ** | **హస్త** | **చి** | **స్వా** | **విశా** | **అనూ** | **జ్యే** |
| ౦ | ౩ | ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ | ౪ |
| **మూ** | **పూషా** | **ఉషా** | **శ్ర** | **ధని** | **శత** | **పూభా** | **ఉభా** | **రేవ** |
| ౩ | ౬ | ౧ | ౪ | ౭ | ౨ | ౫ | ౦ | ౩ |
| ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ | ౧ | ౨ | ౦ |
| ౧ | ౩ | ౦ | ౨ | ౪ | ౧ | ౩ | ౦ | ౨ |

ఫలం ॥ విషమేష్వర్థ లాభస్స్యాత్ సమేషు సమతా భవేత్ ।
శూన్యేషు శూన్యం భవతి ప్రత్యేకం త్రయయోగతః ॥
ఆదిశూన్యే భవేద్వ్యాధి ర్మధ్యశూన్యే మహద్భయం ।
అంత్యశూన్యే భవేద్హానిః కందాయ ఫల మీదృశమ్ ॥

## సంవత్సర ఫలము

| | | | | | |
|---|---|---|---|---|---|
| అశ్విని | పుష్య | స్వాతి | అభిజిత్తు | వారలకు | రోగభయము |
| భరణి | ఆశ్లేష | విశాఖ | శ్రవణం | ,, | ఆయుర్వృద్ధి |
| కృత్తిక | మఘ | అనూరాధ | ధనిష్ఠ | ,, | ధనలాభము |
| రోహిణి | పూఫ | జ్యేష్ఠ | శ. తా | ,, | మనస్తాపము |
| మృగశీర్ష | ఉఫ | మూల | పూ. భా | ,, | రాజపూజ్యత |
| ఆర్ద్ర | హస్త | పూ. షా | ఉ. భా | ,, | యుద్ధభయం |
| పునర్వసు | చిత్త | ఉ. షా | రేవతి | ,, | అలంకారప్రాప్తి |

## కుజచారఫలము

రోహిణి, ఆర్ద్ర, ఆశ్లేష, మఘ, పూఫ, ఉత్తరఫల్గుని, స్వాతి, జ్యేష్ఠ, మూలనక్షత్రములందు చరించుకుజుడు అనావృష్టిని చేయును. మృగశిర, చిత్త, విశాఖలందు చరించి వర్షమును గలుగచేయును. నందన సం॥ చైత్ర బ ౧౪ బు. వక్రించిన కుజునకు అశ్రుముఖము ఉష్ణముఖమునైనవి. ఆ ఫలము—ఈసంవత్సర శ్రావణ బ ౮ మం. కుజోదయపర్యంతము జరుగును. అశ్రుముఖముగుచో నానావిధ వ్యాధులు గలుగును. ఉష్ణముఖముగుచో అగ్ని యంత్రములచే జీవించువారికి పీడ.

## బుధచారఫలము

ఈ సంవత్సరమున నాయామాసములం దుదయించిన బుధుడు నిజవైశాఖ, ఆషాఢ, కార్తిక, పౌషమాసములందు కనుపించుట వలన శస్త్రభయము చోరభయము అగ్నిభయము వ్యాధిభయము జలభయము దుర్భిక్ష భయము గలుగును. మరియు—నైపుడైన బుధోదయానంతర మేకేరి విపరీతఫలము గలుగును. అదివరకు వర్షమున్న ననావృష్టి, ననావృష్టియున్న వర్షము, ఇట్లు వైపరీత్యమును చేయును.

## గురుచారఫలము

గురుడు రాజుగాని సస్యాధిపతిగాని సేనాధిపతిగాని యగుచో భూమి యజ్ఞములచేతను ధాన్యములచేతను వర్షములచేతను నిండి సుభిక్షముగనుండును. ప్రస్తుతము గురుడు సస్యాధిపతియయ్యెను. వత్సరాది ప్ర॥ చైత్ర బ ౧౦ గు. ప॥ మేషగురుడు మేషములకు హాని, పాలకులకు కలహములు, గాని ప్రజలు సుఖింతురు. వర్షములు సస్యములు అనుకూలములగును. చైత్ర బ ౧౦ గు. ప్ర॥ శ్రావణ బ ౬ ఆ॥ ప॥ తిరుగ కార్తిక బ ౮ ఆ. ప్ర॥ వత్సరాంతపర్యంతమును వృషభమున గురుడు. పశువులకు స్త్రీలకు శిశువులకును హాని, సస్యహాని, మధ్యవృష్టి, గొప్పయుద్ధములు గలుగును. నిజవైశాఖ శు ౧౦ శ. ప్ర॥ జ్యేష్ఠ బ ౧౦ సో. ప॥ వృషభ మధ్యభాగమున గురుడు, ఇది దుర్భిక్షయోగము. శ్రావణ బ ౬ ఆ. ప్ర॥ కార్తిక బ ౮ ఆ. ప॥ మిథునగురుడు—ఒకొక్కచో మంచి వర్షముండును. పాలకులకు కలహములందాసక్తి, ప్రజలకు ఈతిబాధా భయము శస్త్రభయము హెచ్చగును.

## శుక్రచారఫలము—ఉదయాస్తఫలము

చైత్ర బ ౮ బు. అశ్వినిలో మధ్యమ మార్గమున గోవీథియందు పడమట నస్తమించి అధికవైశాఖ శు ౨ బు. న రేవతిలో ఆ మార్గమున నావీథియందే తూర్పున నుదయించును. ఫలము—మధ్యమ మార్గమగుటచే సస్యములు ధరలు మధ్యమముగ నుండును. పరరాష్ట్రములు స్వరాష్ట్రమున చేరుటయోగము. వాటిని చక్కగ పాలించుట క్షేమము. ఈ యోగక్షేమములును మధ్యమముగనుండును. గోవీథిగావున సస్యములకును గోసంపదగల వార్లకును హానియగును. తిరుగ మార్గశిర బ ౮ మం. న మూలనక్షత్రమున దక్షిణమార్గమున మృగవీథియందు తూర్పున నస్తమించి మాఘ బ ౮ శ న పూర్వాభాద్రయందు మధ్యమమార్గమున గోవీథియందు పడమట నుదయించెను. దక్షిణమార్గమగుటచే ధాన్యమును జాగ్రతచేసి భూమియందు నూవులచల్లవలెను. (నూవులు పండును. ధాన్యముపండదు) మృగవీథిగావున మృగములకు వ్యాధులు గలుగును. తపసుచేయువారికి సస్యములకును వ్యాధులు గలుగును. (మధ్యమమార్గ గోవీథులకు పూర్వోక్తఫలమే) పక్షఫలం ॥ శుక్లపక్షమున ఉదయాస్తములగుచో యుద్ధములు సంభవించును. కృష్ణపక్షమున గల్గినచో సైనికవృద్ధి, మణ్డలములలో మొదటి ఉదయాస్తములు రెండవసారి ఉదయము ధనిష్ఠాదిమండలమున జరిగినవి. ఇది శుభప్రదము, పశువృద్ధి ధనవృద్ధి ధాన్యవృద్ధియు నగును. ఒకొక్కచో భయము గలుగుచుండును. రెండవసారి అస్తమయము జ్యేష్ఠాదిమండలమున

నైనది. దుర్భిక్షము, చోరభయము, రోగభయము గలుగును. కాశ్మీరము, అశ్మక దేశము, మత్స్య దేశము, చారుదేవీనదీ తీరము, ఉజ్జయిని ప్రాంతము ఇవి నశించును.

## శ ని చా ర ఫ ల ము

వత్సరాది ప్ర॥ అధిక వైశాఖ శు ౧౧ శు. ప॥ చిత్రలో తులయందు శని. పిమ్మట శ్రావణ శు ౧౧ శు. ప॥ చిత్రలో కన్యయందు శని. ఆ పిమ్మట అశ్వయుజ శు ౧౪ బు. ప॥ చిత్రలో తులయందును, అటనుండి స్వాతీ నక్షత్రమున తులయందును శని.

ఫలము :—కన్యారాశి సంచారముచే సువృష్టి, సస్య వృద్ధి, అనుకూలమైన ధరలు, సైనికవృద్ధియు గలుగును గాని మహ్రషములు, పాలకులు పంచకార్మికులు పీడనందెదరు. (నాపక, చాక్రికి, రజక, సూచిక, చిత్రకారులు పంచకార్మికులు.) తులారాశిసంచారముచే ప్రజాసుఖము, సువృష్టి సస్యవృద్ధియు గలుగును. కులూత దేశము (కాశ్మీరప్రాంతము) లాక్షారసము, కుంకుమపూవు మొదలగు ద్రవ్యములును నాట్యముచే జీవించువారును స్త్రీలును పీడనందెదరు.

చిత్రానక్షత్ర సంచారముచే స్త్రీజనము, లేఖకులు, చిత్రకారులు, నానావర్ణములుగల అలంకారములు మొదలగునవి నశించును. స్వాతినక్షత్రసంచారముచే మగధదేశవాసులు, గూఢచారాదిచారులు దూతలు, సూతులు నావికులు నటులు మొదలగువారు హాని జెందెదరు. రెండు నక్షత్రములందే నరించుటకు ఫలము మంచిదిగాదు.

కూర్మచక్రముచే—లంకా, కాలికట, గిరినగర (కోంపిడు) కొంకణ, దశపుర గోనర్ద, కర్నాట, నాసిక్య (నాసికాప్రాంతము) చోల, అత్రినగర (అత్రిలి) ధర్మపత్తన (ధర్మపురి) కాంచీ, సింహల, కేరల, దండకారణ్య, ఆంధ్ర, హస్తికుంభ, మలయదర్దుర, మహేంద్ర (మందసా) చిత్రకూట, కోల్లగిరి, ఋశ్యమూక, శ్రీపర్వత (శ్రీశైల) త్రికూట, కిష్కింధా, కావేరీ, తామ్రపర్ణీ, నర్మదా, వేణాద్యాశ్రయ తత్తత్ప్రాంతస్థ దక్షిణదేశవాసులకును—పహ్లవ, కాంభోజ, సింధు, సౌవిర, అరబ, ఆనర్త, బర్బర, కిరాత, అభీర, రైవతక, సురాష్ట్ర, ద్రవిడ, మహారాష్ట్ర బాహ్లీకాది నైరృతి దేశవాసులకు అరిష్టము గలుగును.

## రాహుచారము - గ్రహణమాసఫలము

ఆషాఢమాసగ్రహణముచే కాశ్మీరము గాంధారము, పులింద దేశము, చైనాదేశమున్ను పీడనందును. తటాకములు నదీప్రవాహములు తగ్గును. పండ్లు గుంపలు పీటివర్తకముచే జీవించువారలకు హాని, ఖండవృష్టిగ వర్షించును.

పౌషమాసగ్రహణముచే బ్రాహ్మణక్షత్రియులకు హాని. సైంధవ, కుకుర, విదేహ దేశములు ధ్వంసములగును. అల్పవృష్టి, దుర్భిక్షము, భయము గలుగును.

## దే శా రి ష్ట యో గ ము లు

1. వత్సరాది ప్ర చైత్ర శు ౧౦ మం. ప॥ బుధశనిగ్రహద్వయవక్రము. ఫలం ॥ (ప్రభుసంక్షోభము)

2. వత్సరాది ప్ర॥ చైత్ర బ ౧౦ గు. ప॥ గురుశని సమసప్తకము. ఫలము—వింధ్యకును కావేరికిని మధ్యదేశమున జనహాని.

3. వత్సరాది ప్ర. చైత్ర బ ౧౦ గు. ప॥ కుజగురులకు సప్తమశని, ఫలము—అయోధ్యనుండి లంకవరకునైన దేశమున యుద్ధభయము, దుర్భిక్షము గలుగును.

4. చైత్ర శు ౯ సో. ప్ర॥ బ ౩౦ సో. ప. శుక్రోగ్రకుజుడు ఫలం॥ అనావృష్టి.

5. చైత్ర శు ౧౦ మం. ప్ర॥ బ ౭ బు. ప. బుధశుక్ర శనిగ్రహత్రయ వక్రం. ఫలం - యుద్ధభయము అనావృష్టియు గలుగును.

6. వత్సరాది ప్ర॥ అధిక వైశాఖ శు ౧౧ శు. ప॥ తులలో శని ఫలము—పాలకులకు ప్రజలకును హాని దుర్భిక్షము గలుగును.

7. చైత్ర బ ౨ బు. ప్ర॥ అధికవైశాఖ బ ౫ సో. ప॥ శుక్రశనిగ్రహద్వయ వక్రము. (1 చూ)

8. చైత్ర బ ౧౦ గు. ప్ర॥ అధిక వైశాఖ శు ౧౧ శు. ప. గురు శని షష్ఠాష్టకము. ఫలం॥ వింధ్యకు దక్షిణదేశమున జనహాని.

9. చైత్ర బ ౩౦ సో. ప్ర॥ అధికవైశాఖ శు ౧౧ శు. ప॥ రవి శని సమసప్తకము. (అనావృష్టి)

10. అధికవైశాఖ శు ౧౧ శు. ప్ర॥ జ్యేష్ఠ శు ౧౧ మం. ప॥ కన్యలో శనివక్రము. ఫలము॥ దుర్భిక్షము. సస్యహాని, ప్రజలకు భయంకరములైన మశూచికాది పిత్తవ్యాధులు, గవాశ్వాదిపీడ, యుద్ధభయము గలుగును.

11. అధిక వైశాఖ శు ౧౧ శు. ప్ర॥ శ్రావణ శు ౧౧ శు. ప॥ కన్యా శని. ఫలము, అంగ వంగ కళింగ గౌడదేశములందును సౌరాష్ట్రబాహ్లీక దేశములందును పీడయగును. ఇతరదేశములందు శుభప్రదము.

12. అధికవైశాఖ శు ౧౩ సో. ప్ర॥ నిజవైశాఖ శు ౧౧ ఆ. ప॥ సూర్యగ్రముక కుజుడు. ఫలము॥ యుద్ధభయము.

13. నిజవైశాఖ శు ౧౦ శ. ప్ర॥ జ్యేష్ఠ బ ౧౦ సో. ప॥ వృషభమధ్య గురుడు. ఫలము, దుర్భిక్షము.

14. నిజవైశాఖ శు ౧౨ సో. ప్ర॥ ఆషాఢ శు ౧౨ గు. ప॥ శుక్రోగ్రగురుడు. ఫలము॥ దుర్భిక్షము.

15. నిజవైశాఖ బ ౯ శ. ప్ర॥ ఆషాఢ శు ౬ శు. ప॥ ఆషాఢ బ ౮ ఆ. ప్ర॥ శ్రావణ బ ౧౧ గు. ప॥ తూర్పునను ఆర్ద్రాది పంచకమున ఋషి దర్శనము. ఫలము, వ్యాధులు, అనావృష్టి, దుర్భిక్షము, రాజవిద్వేషము, మిడతలవలనభీతి.

16. ఆషాఢ శు ౮ ఆ. ప్ర॥ శ్రావణ బ ౧౧ గు. ప॥ కుజకేతుయోగము. ఫలము, కళింగ అంగ, వంగదేశములందు సస్యహాని భూకంప భయము యుద్ధభయము గల్గును.

17. ఆషాఢ శు ౧౨ గు. ప్ర॥ బ ౩ బు. ప॥ శుక్రోగ్రకుజుడు. ఫలము, అనావృష్టి.

18. శ్రావణ శు ౧౧ శు. ప్ర॥ బ ౬ ఆ. ప॥ గురుశని షష్ఠాష్టకము. ఫలము, (8 చూ)

19. శ్రావణ శు ౧౧ శు. ప్ర॥ సంవత్సరాంత ప॥ తులలో శని. ఫలము, అంగ వంగ కళింగ గౌడ సౌరాష్ట్ర బాహ్లీక దేశములందు పీడ.

20. శ్రావణ శు ౧౨ శ. ప్ర॥ భాద్ర బ ౧౨ ఆ. ప॥ శుక్రోగ్రకుజుడు. (17 చూ) (శ్రావణ శు ౧౨ శ. ప్ర॥ శ్రావ బ ౮ సో. ప॥ కేతువ్యవధానము)

21. ఆశ్వ. బ ౧ శు. ప్ర॥ కార్తిక శు ౮ శ. ప॥ శుక్రోగ్రశని ఫలము, జలహాని.

22. ఆశ్వ బ ౧౨ మం. ప్ర॥ కార్తిక బ ౩ సో. ప॥ బుధగురుగ్రహద్వయవక్రము ఫలము—యుద్ధ ప్రయత్నములు జరుగును.

23. కార్తిక బ ౯ ఆ. ప్ర. మార్గ శు ౯ మం. ప॥ రవి గురు సమసప్తకము. ఫలము, అనావృష్టి.

24. కార్తిక బ ౯ ఆ. ప్ర॥ సంవత్సరాంతప॥ గురు శని షష్ఠాష్టకము. ఫలము, (చూ 8 యో)

25. కార్తిక బ ౧౦ సో. ప్ర॥ మార్గ బ ౪ గు. ప॥ గురు శుక్ర సమసప్తకము. ఫలము, ప్రజలకు జలభయమో, అగ్నిభయమో, రోగభయమో, యుద్ధభయమో, చోరభయమో, దుండగుల వలని భయమో, సర్పభయమో గల్గును.

26. మార్గశిర శు ౩ బు. ప్ర॥ పౌష బ ౯ గు. ప॥ తులలో కుజశనులు. మార్గశిర బ ౧౩ శు. వ కుజశనియుతి ఫలము, అగ్ని భయము వాయు భయము గల్గును.

